# బ్రహ్మసత్యం-జగన్మిథ్యా

## (అద్వైతసారము)

### స్వామి పరమానందనాథ

శ్రీ గణపతి సచ్చిదానంద ప్రశస్తి అవార్డు గ్రహీత
విశిష్ఠ విద్యాశిరోమణి, ప్రముఖ శ్రీవిద్యా ప్రచారకులు,
చతుర్వేద భాష్యకారులు, శ్రీవిద్యాబ్రహ్మసూత్ర భాష్యకారులు
అవధూత దత్తపీఠ ఆస్థాన విద్వాంసులు,
ఇండియా కల్చరల్ సెంటర్ & టెంపుల్, అమెరికా.
ఆస్థాన విద్వాంసులు, కనకాభిషేకగ్రహీత,
గండపెండేర సన్మానిత, సువర్ణ ఘంటాకంకణ,
శ్రీవిద్యారత్నాకర, శ్రీవిద్యావిశారద

### డా॥ క్రోవి పార్థసారథి

ప్రకాశకులు :

శివకామేశ్వరి గ్రంథమాల

41-22/4-36, భ్రమరాంబాపురం, కృష్ణలంక,

విజయవాడ-520 013, ఫోన్ : 0866-2522824

# బ్రహ్మసత్యం - జగన్మిథ్యా

## స్వామి పరమానందనాథ

## (డా॥ క్రోవి పార్థసారథి)

ప్రథమ ముద్రణ : విళంబి నామ సంవత్సర చైత్ర శుద్ధ పాడ్యమి

ఆదివారం 18-03-2018

ప్రతులు : 2000



**వెల : రూ. 45-00**

ప్రతులకు :

1. **డా॥ క్రోవి పార్థసారథి**
   23-11/1-10/2, దేవీ నిలయం,
   ఓగిరాలవారి వీధి, సత్యన్నారాయణపురం,
   విజయవాడ - 11. సెల్ : 9866820574

2. **శివకామేశ్వరి గ్రంథమాల**
   41-22/4-36, భ్రమరాంబాపురం,
   కృష్ణలంక, విజయవాడ-520 013.
   ఫోన్ : 0866-2522824

3. **శివకామేశ్వరి ఆర్ష గ్రంథమాల**
   27-18-59, కాంగ్రెస్ ఆఫీస్ రోడ్డు,
   గవర్నర్‌పేట, విజయవాడ-520 002.
   ఫోన్ : 0866-6661777

ముద్రణ :
నిర్మలా ఆఫ్‌సెట్ ప్రింటర్స్,
గాంధీనగర్, విజయవాడ-3.

శ్రీరామచన్ద్రాయ నమః

# ఆనందము

శ్రీ క్రోవి పార్థసారథి గారు పరమానందనాథ దీక్షా నామధేయులు రచించిన 'బ్రహ్మసత్యం-జగన్మిథ్యా' యను గ్రంథమిప్పుడు పాఠకుల హస్తముల నలంకరించినది. ఇది చిన్న వేదాంత ప్రకరణము. శ్రీవిద్య దర్శనములు, వేదాంతము, ఈ గ్రంథకర్త ప్రధాన క్షేత్రములు. ఈ 3 శాస్త్రములను బురస్కరించుకొని ఇంతకు ముందే సుమారు 45 గ్రంథములను రచించి అందించిరి. బ్రహ్మసూత్రములపై 4 గ్రంథములు వెలువరించిరి. శ్రీవిద్యాబ్రహ్మసూత్ర భాష్యమిటీవలనే వెలువడినది. వీరు రచించిన గ్రంథములలో 1.శ్రీవిష్ణు సహస్రనామ వివరణము 2. లలితా సహస్రనామ భాష్యము 3. చతుర్వేద భాష్యము. వ్యాఖ్యానము పెద్ద గ్రంథములు. ఈ మూడే గ్రంథకర్తకు ఎక్కువ పేరు తెచ్చినవి. ఈ గ్రంథములన్నియు ప్రాచీన గ్రంథములకు అనువాదప్రాయము. ఇవి ఎంతో కొంత శాస్త్రములలో ప్రవేశమున్న వారికి మాత్రమే అవగతమగును.

ప్రస్తుత గ్రంథమట్టిది కాదు. మిక్కిలి సులభభాషలో నాకర్షక శైలిలో రచించిన స్వతంత్ర గ్రంథము. ఆస్తిక శాస్త్రములన్నియు భగవంతు నంగీకరించుచున్నవి. అన్ని శాస్త్రముల జగత్తు సత్యమనియే ప్రతిపాదించు చున్నవి. ఒక్క శ్రీశంకర భగవత్పాదుల యద్వైత వేదాంత దర్శనము మాత్రమే బ్రహ్మమొక్కటియే సత్యము. తక్కిన జగత్తంతయు మిథ్య యని నిరూపించుచున్నవి. ఈ విషయమే ఈ గ్రంథములో వివరింపబడినది.

ఉపనిషత్తులలోని 4,5 కథలు వేదాంత విద్యకు ఉపోద్ఘాతముగ జెప్పినారు. **'తత్త్వమసి'** మహావాక్యముకు గైకొని జీవుడే బ్రహ్మమని నిరూపించినారు. ఆ తరువాత యీ జగత్తెట్లేర్పడినచో విశదీకరించి ఈ

సందర్భములో 1. చార్వాక జైన బౌద్ధములను నాస్తిక దర్శనములు, 1.న్యాయ 2. వైశేషిక 3. సాంఖ్య 4) యోగ 5. వేదాంత దర్శములు అను ఆస్తిక దర్శనములలో సృష్టిని గూర్చి వివరించినారు. తరువాత ఉపనిషత్తులు పురాణములు, అద్వైత వేదాంతము జగస్సృష్టిని గూర్చి యెట్లు చెప్పినవో నిరూపించినారు. సృష్టి విషయముల నుపనిషత్తులలోని విభిన్న ప్రక్రియలను నిరూపించి చివరకు 16 ఉదాహరణలతో జగత్తెట్లనిత్యమో నిరూపించారు.

సంక్షేప శారీరకములో జెప్పిన 1. ఆరంభవాదము 2. సంఘాతవాదము 3. పరిణామ వాదము 4. వివర్తవాదమును నిరూపించుట యీ గ్రంథమున కలంకారముగా నున్నది. వీరింతకు ముందే **వేదాంత విద్యాసారథి**యను వేదాంత ప్రకరణము శాస్త్ర పద్ధతిలో వ్రాయబడిన గ్రంథము ఈ **'బ్రహ్మ సత్యం-జగన్మిథ్యా'** యనునది మాత్రము సామాన్య పాఠకుని దృష్టిలో బెట్టుకొని రచించినది. ఈనాటి జనులకిటువంటి గ్రంథములే యెక్కువ యవసరము. పార్థసారథి గారి కృతులలో నీ గ్రంథము నన్నెక్కువగా నాకర్షించినది. ఆయానంద ప్రకటనమే యీ పీఠిక.

శ్రీ పార్థసారథి గారిట్లే యనేక గ్రంథములను రచించి ప్రాచీన భారతీయ సంస్కృతి-సంప్రదాయములను ప్రముఖముగా ప్రచారము చేయు భాగ్యము ననుగ్రహించు గాక యని యా జగన్మాత యగు దుర్గాంబను వేడుకొనుచున్నాను.

శ్రీ పరమేశ్వరార్పణమస్తు

ఇట్లు

సకల సుకవి బుధజనవిధేయులు

**గరిమెళ్ళ సోమయాజులు శర్మ**

పుష్పగిరి పీఠ ఆస్థాన విద్వాంసులు

విజయవాడ,

2-2-2018.

# ప్రణతులు

చరాచర జగత్తులో బ్రహ్మము ఒక్కటే సత్యము, నిత్యము, శాశ్వతమైనది. ఈ జగత్తంతా మిథ్య. అసలు జగత్తనేది లేదు. నీ అజ్ఞానం వల్ల జగత్తు ఉన్నట్లుగా కనిపిస్తోంది. అజ్ఞానం పోయి జ్ఞానం కలిగితే జగత్తు తన అధిష్ఠానమైన బ్రహ్మములో కలిసి పోతుంది. అందుకే **'బ్రహ్మసత్యం–జగన్మిథ్యా'** అన్నాడు శంకరుడు. ఇది అద్వైత సిద్ధాంతం. ఇదే అద్వైతసారము.

సామాన్య మానవుడికి ఈ విషయం తెలియదు. చాలామంది దీన్ని చిలకపలుకులాగా పలుకుతుంటారు. ఈ అద్వైతసారం అందరికీ తేలికగా అర్థంకావాలనే ఉద్దేశ్యంతోనే **'బ్రహ్మసత్యం–జగన్మిథ్యా'** అనే ఈ చిన్న పుస్తకాన్ని అత్యంత సులభశైలిలో, వీలైనన్ని ఉదాహరణలతో వ్రాయటం జరిగింది. సృష్టి ఎలా జరిగింది? అనే విషయాన్ని వివరించటానికి వేదాలు, దర్శనాలు, ఉపనిషత్తులు, పురాణాలు అన్నీ ఉదాహరించటం జరిగింది. చివరగా **జగత్తుమిథ్య** అనే విషయం పదహారు ఉదాహరణలతో ప్రతిపాదించ బడింది.

నేనేమీ గొప్ప పండితుణ్ణి కాదు. నాకు తెలిసింది చాలా తక్కువ. అయినప్పటికీ ఇటువంటి గొప్పవిషయం సామాన్యుడికి కూడా అర్థం కావాలనే ఉద్దేశ్యంతోనే ఈ పుస్తకం వ్రాయటం జరిగింది. గ్రంథానికి శ్రీముఖం అందించిన శ్రీ గరిమళ్ళ సోమయాజుల శర్మగారికి కృతజ్ఞతలు. గతంలో నేను వ్రాసిన గ్రంథాలలాగానే దీన్నికూడా పాఠకులు ఆదరిస్తారని భావిస్తూ...

గ్రంథం మీద సవిమర్శలను ఆహ్వానిస్తూ
స్వర్గస్థురాలైన నా భార్య రమాదేవి స్మరిస్తూ

**స్వామి పరమానందనాథ**
(డా॥ క్రోవి పార్థసారథి)

వికంబి నామ సంవత్సర
చైత్ర శుద్ధ పాడ్యమి, ఆదివారం
18–03–2018

# విషయ సూచిక

# బ్రహ్మసత్యం - జగన్మిథ్యా
# (అద్వైతసారము)

## 1. జగత్తంతా పరమేశ్వర స్వరూపమే

**బ్రహ్మసత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపరః ।**
**అనేన వేద్యం సచ్ఛాస్త్రమితి వేదాంత డిండిమః ॥**

చరాచర జగత్తులో సత్యము, నిత్యము, శాశ్వతమైనది పరబ్రహ్మ ఒక్కటే. దృశ్యమానమైన జగత్తంతా మిథ్య. మాయాకల్పితమైనది. జీవాత్మ పరమాత్మ రెండూ ఒక్కటే. బ్రహ్మమును గురించి ఇలాగే తెలుసుకోవాలి అని వేదాంత శాస్త్రము ఘోషిస్తున్నది. **(బ్రహ్మజ్ఞానావళీమాలా 21)**

**బ్రహ్మసత్యం జగన్మిథ్యా జీవోబ్రహ్మైవ నాపరః ।**
**జీవన్ముక్తస్తు తద్విద్వాన్ ఇతి వేదాంత డిండిమః ॥**

బ్రహ్మమే సత్యము నిత్యము శాశ్వతమైనది. ఈ జగత్తంతా మిథ్య. జీవాత్మ పరమాత్మ రెండూ ఒకటే. వేరు కాదు. ఈ విషయం గ్రహించిన వాడే జీవన్ముక్తుడు.

అంటున్నారు భగవత్పాదుల వారు తమ **వేదాంత డిండిమము** లోని 66వ శ్లోకంలో

దృశ్యమానమైన జగత్తులో నామరూపాలన్నీ నశించిపోయేవే. అందుకే అవి అశాశ్వతమైనవి అంటున్నారు. నదీనదాలు, అడవులు, కొండలు, ఎడారులు, రాజులు, రాజ్యాలు సమస్త ప్రాణికోటి అంతా నశించిపోయేదే.

**కారే రాజులు రాజ్యముల్ కల్గవే**
**వారేరీ సిరిమూట కట్టుకుని పోవం జాలిరే**

ఎందరో మహానుభావులు రాజ్యాలు స్థాపించి, భూమిని పాలించారు. తరువాత కాలంలో వాళ్ళు పోయారు. వారి రాజ్యాలు పోయినాయి. అంతదాకా ఎందుకు?

నీ తండ్రి, తాత, ముత్తాత అందరూ గతించారు. ప్రతిరోజూ నీ కళ్ళ ఎదురుగానే అనేకమంది మరణిస్తున్నారు. ఇవాళ్ళవారు. రేపు నువ్వు అంతే. ఇది భూలోకం దీనికే 'మర్త్యలోకము' అని కూడా పేరు. మర్త్యలోకము అంటే 'మరణమే ధర్మముగా గలది' అని అర్థం. ఈ భూమిమీద పుట్టిన ప్రతిప్రాణి; ప్రతిజీవి, ప్రతి వస్తువు నశించిపోయేదే. ప్రళయ కాలంలో పంచభూతాలు కూడా నశించిపోతాయి.

| | | |
|---|---|---|
| పృథివి | – | జలంలో |
| జలం | – | అగ్నిలో |
| అగ్ని | – | వాయువులో |
| వాయువు | – | ఆకాశంలో |
| ఆకాశం | – | అహంకారంలో |
| అహంకారం | – | మహత్తత్త్వంలో |
| మహత్తత్త్వము | – | అవ్యక్తంలో లీనమై పోతుంది |

ఈ రకంగా జగత్తులో దృశ్యమానమైనవన్నీ నశించిపోయేవే. ఇవేవీ శాశ్వతమైనవి కావు. బ్రహ్మము ఒక్కటే సత్యము, నిత్యము, శాశ్వతమైనది. కంటికి కనిపించే జీవాత్మ పరమాత్మ కన్న వేరైనది కాదు. జీవాత్మ పరమాత్మ రెండూ ఒక్కటే అంటున్నారు శంకర భగవత్పాదుల వారు తమ **'బ్రహ్మజ్ఞానావళీమాల'** లోని 21వ శ్లోకంలో. ఇప్పుడు ఇందులోని విషయాలను వివరంగా చూద్దాం. ముందుగా **'జగత్తంతా పరమేశ్వర స్వరూపమే'** అనే విషయాన్ని చూద్దాం.

**ఛాందోగ్యోపనిషత్తు**లో ఒక కథ ఉంది. పూర్వకాలంలో గౌతముడు అని ఒక మహర్షి ఉండేవాడు. ఆ రోజులలో అతడు చాలా గొప్ప బ్రహ్మవేత్త. సుదూర ప్రాంతాల నుంచి కూడా విద్యార్థులు వచ్చి ఆయన దగ్గర విద్య నభ్యసించేవారు. ఒక రోజున "సత్యకాముడు' అనే బ్రహ్మచారి వచ్చాడు. అతడు వేదవేదాంగాలన్నీ పూర్తి చేశాడు. యజ్ఞయాగాది క్రతువులు నిర్వహించటంలో నేర్పరి. ఇప్పుడు బ్రహ్మవిద్యను అభ్యసించాలనిపించింది. అందుకని బ్రహ్మవిద్యలో నిష్ణాతుడుగా పేరు గాంచిన గౌతముడి దగ్గరకు వచ్చాడు. మహర్షికి నమస్కరించి బ్రహ్మవిద్యను ఉపదేశించమని

ప్రార్థించాడు. మహర్షి ఒక నిమిషం ఆలోచించి 'నీతండ్రి ఎవరు? అని అడిగాడు. తెలియదన్నాడు సత్యకాముడు. ఇంటికివెళ్ళి నాతల్లిని అడిగి వస్తాను అని గురువుగారికి చెప్పి ఇంటికి వెళ్ళాడు. తన తండ్రి ఎవరో చెప్పమని తల్లిని అడిగాడు. అప్పుడు ఆమె 'నాయనా! నేను యవ్వనంలో ఉండగా అనేకమంది ఇళ్ళలో దాసీగా పనిచేశాను. అప్పుడు నువ్వు జన్మించావు. నాకు అంతవరకే తెలుసు.' అంది. సత్యకాముడు గురువుగారి దగ్గరకు వెళ్ళి తల్లి చెప్పిన మాటలు యథాతథంగా చెప్పాడు. గురువుగారు చాలా సంతోషించి 'సత్యకామా! నీ తల్లి నిజం చెప్పింది. నిజం చెప్పగల ధైర్యం ఒక్క బ్రాహ్మణుడికి మాత్రమే ఉంటుంది. అందుచేత నీవు బ్రాహ్మణుడవే. నీకు బ్రహ్మవిద్యను చెబుతాను' అన్నాడు. సత్యకాముడు గురుకులంలో చేరాడు. ఆ రోజుల్లో విద్య నేర్చుకోవటానికి మూడు పద్ధతులుండేవి.

**గురుశుశ్రూషయావిద్యా । పుష్కలేన ధనేనవా ।**
**అథవా విద్యయా విద్యా । చతుర్థోనోప లభ్యతే ॥**

1. గురువు గారికి శుశ్రూష (సేవ) చేసి విద్యను అభ్యసించటము.
2. గురువు గారికి కావలసిన ధనం ఇచ్చి వారి దగ్గర విద్య నభ్యసించటము.
3. తనకు తెలిసిన విద్యను గురువు గారికి చెప్పి, ఆయన దగ్గర నుంచి తనకు కావలసిన దాన్ని నేర్చుకోవటము.

ఈ మూడే పద్ధతులు. నాల్గవ పద్ధతి లేదు. సామాన్యంగా విద్యార్థులందరూ మొదటి పద్ధతినే ఎన్నుకునే వారు. ఈ పద్ధతిలో గురువు గారికి అవసరమయిన పనులు చేసి పెడుతూ విద్యాభ్యాసం చెయ్యాలి. అవసరమైన పనులు అంటే ఆశ్రమ ప్రాంగణం అంతా ఊడ్చి నీళ్ళు జల్లి ముగ్గులు అలంకరించటము, గోశాల బాగు చెయ్యటము. ఆవులను అడవికి తోలుకువెళ్ళి మేపుకు రావటము. హోమానికి సమిధలు ఏర్పాటు చెయ్యటము ఇవన్నీ శుశ్రూషలో భాగమే.

సత్యకాముడు కూడా మిగిలిన విద్యార్థులలాగానే ఆశ్రమం అంతా శుభ్రం చేస్తున్నాడు. ఆవులను అడవికి తీసుకువెళ్ళి మేపుకు వస్తున్నాడు. నిత్యాగ్ని హోత్రానికి, ప్రతిరోజూ జరిగే హోమాలకు సమిధలు ఏర్పాటు చేస్తున్నాడు. కాలం గడిచిపోతోంది.

అతనితోపాటు గురుకులానికి వచ్చిన వారందరూ విద్యాభ్యాసం పూర్తి చేసుకుని తిరిగి ఇళ్ళకు వెళ్ళిపోతున్నారు. ఇక్కడ చిన్న అనుమానం వస్తుంది. సత్యకాముడితో పాటుగా వచ్చిన వాళ్ళు ఏం నేర్చుకున్నారు? అని. గురుకులంలో అన్ని రకాల విద్యలు ఉంటాయి. నేటి మన విశ్వవిద్యాలయాల్లాగానే ఉండేవి గురుకులాలు. అక్కడ వేదం, తర్కం, జ్యోతిషం, స్మార్తం, ఒకటేమిటి. జీవనోపాధికి పనికి వచ్చే విద్యలన్నీ ఉండేవి. అందులో కావలసిన వారికి బ్రహ్మవిద్యను కూడా బోధిస్తారు. ఇప్పుడు సత్యకాముడితో పాటుగా వచ్చిన వారి విద్యాభ్యాసం పూర్తయింది. కాని గురువుగారు సత్యకాముడికి ఏమీ చెప్పలా? గురుకులానికి వచ్చినప్పుడు ఎలా ఉన్నాడో ఇప్పుడు కూడా అలానే ఉన్నాడు సత్యకాముడు. ఒకరోజు సాయంత్రం ఏకాంతంగా కూర్చుని ఆలోచిస్తున్నాడు సత్యకాముడు. తను చేసిన పొరపాటు ఏమిటి? గురువుగారు తనకు ఎందుకుగాను విద్య చెప్పటం లేదు? తన కర్మ ఇంకా పరిపక్వం పొందలేదా? తలచుకుంటేనే దుఃఖం పెల్లుబికి వస్తోంది. కళ్ళ వెంబడి అశ్రుధారలు ప్రవహిస్తున్నాయి. బలవంతాన ఆపుకుంటున్నాడు. మనసులో చాలా బాధగా ఉంది. ఏం చెయ్యాలి? ఆలోచిస్తున్నాడు. ఇంతలో గురువుగారి దగ్గర నుంచి పిలుపు వచ్చింది. లేచి పరుగెత్తాడు సత్యకాముడు. సత్యకాముణ్ణి చూసిన గౌతముడు 'సత్యకామా! మన గోశాలలో వట్టిపోయిన ఆవులు నాలుగు వందలదాకా ఉన్నాయి. ఆ ఆవులు. కొన్ని ఆ బోతుల్ని తోలుకుని అడవికి వెళ్ళు. వాటి సంఖ్య రెట్టింపయ్యేదాకా అడవిలోనే ఉండి తరువాత రా.' అన్నాడు. సరేనన్నాడు సత్యకాముడు. మరునాడు ఉదయమే ఆవులను ఆబోతులను తోలుకుని అడవికి వెళ్ళాడు. అడవిలో ఆవులని మేపుతున్నాడే కాని అతని మనస్సు చాలా బాధ పడుతోంది. ఇవన్నీ వట్టిపోయిన ఆవులు. వీటి సంఖ్య రెట్టింపు కావాలి. అంటే ఇవి అడవిలో బాగా మేసి, సూడివై పిల్లల్ని పెట్టాలి. అప్పటికి కాని వాటి సంఖ్య రెట్టింపు కాదు. ఇదంతా పూర్తి కావాలంటే కనీసం రెండు సం॥ కాలం పడుతుంది. అంత వరకు తను అడవిలోనే ఉండాలి. మరి బ్రహ్మవిద్య ఏమై పోతుంది? దాన్ని గురించి ఎప్పటికి తెలుస్తుంది? విచారిస్తూనే ఉన్నాడు. కాలం గడిచిపోతోంది. క్రమేణా అడవిలో బాగా పచ్చిక మేసిన ఆవులు బలంగా తయారయినాయి. వాటిలో కొన్ని సూడివి కూడా అయినాయి. వాటికి పుట్టిన పిల్లలు కూడా క్రమేణా

పెరుగుతున్నాయి. కాలక్రమంలో మిగిలిన ఆవులు కూడా సూడివై పిల్లల్ని పెట్టాయి. ఆవుల సంఖ్య రెట్టింపు కూడా అయింది.

ఒకరోజు సాయంత్రం ఆవులు గడ్డి మేస్తున్నాయి. సత్యకాముడు ఒక చెట్టు క్రింద కూర్చుని ఆలోచిస్తున్నాడు. 'ఈ ఆవుల సంఖ్య ఎప్పటికి రెట్టింపు అవుతుంది? తను ఆశ్రమానికి ఎప్పుడు చేరుకుంటాడు? బ్రహ్మవిద్య ఎప్పుడు లభిస్తుంది?' ఇలా ఆలోచిస్తున్న సమయంలో 'సత్యకామా!' అన్న పిలుపు వినిపించింది. తటాలున తల ఎత్తి చూశాడు. చుట్టుప్రక్కల నరమానవుడు ఎవడూ లేడు. యథాలాపంగా విన్నానేమో అనుకుని మళ్ళీ ఆలోచనలో పడ్డాడు సత్యకాముడు. 'సత్యకామా!' అదే పిలుపు మళ్ళీ వినిపించింది. తల ఎత్తి చూశాడు. ఎదురుగా ఒక ముసలి ఆబోతు నుంచుని ఉంది. అది మానవభాషలో మాట్లాడుతోంది. "సత్యకామా! ఆవుల సంఖ్య రెట్టింపయ్యే దాకా వాటిని మేపమన్నారు గురువుగారు. ఇప్పుడు వాటి సంఖ్య రెట్టింపయింది. కాబట్టి ఆవులను తోలుకుని ఆశ్రమానికి బయలుదేరు. పరబ్రహ్మ స్వరూపం నాలుగు పాదాలుగా ఉంటుంది. అదులో మొదటి పాదాన్ని నేను చెబుతాను విను. జగత్తులో ఉండే తూర్పు, పడమర, ఉత్తరం, దక్షిణం. నాలుగు దిక్కులు పరబ్రహ్మలో ఒక భాగము. రెండవ పాదాన్ని అగ్నిదేవుడు చెబుతాడు. రేపు ఉదయాన్నే ఆవులు తోలుకుని ఆశ్రమానికి బయలుదేరు" అంది. చాలా ఆశ్చర్యపోయాడు సత్యకాముడు. కొంతసేపటికి తేరుకుని, మరునాడు ఉదయమే ఆవుల్ని తోలుకుని ఆశ్రమానికి బయలుదేరాడు. సాయంత్రం కావస్తోంది. ఒక సరస్సు ఉన్న ప్రదేశం చూసుకుని ఆగాడు. ఆవులన్నీ పడుకుని నెమరువేస్తూ విశ్రాంతి తీసుకుంటున్నాయి. సత్యకాముడు సరస్సులో స్నానం చేసి, అగ్నిహోత్రం వెలిగించి సంధ్యావందనం చేస్తున్నాడు. హోమకుండంలోంచి మాటలు వినిపించాయి. అగ్నిదేవుడు చెబుతున్నాడు. "సత్యకామా! బ్రహ్మము యొక్క రెండవ పాదాన్ని నేను చెబుతాను. జగత్తులో అడవులు, కొండలు, బండలు, పర్వతాలు, ఎడారులు, లోయలు, నదీనదాలు, సముద్రాలు అన్నీ పరబ్రహ్మ స్వరూపమే. మూడవ పాదాన్ని ఒక హంస చెబుతుంది. నువు బయల్దేరు" అనే మాటలు వినిపించాయి. అగ్నిదేవుడికి నమస్కరించి మరునాడు ఉదయాన్నే బయలుదేరాడు. సాయంత్రం దాకా నడిచి

ఒకచెట్టు క్రింద బస చేసి సంధ్యావందనం చేస్తున్నాడు. ఇంతలో ఒక హంస వచ్చి సత్యకాముడి ప్రక్కన వాలి 'సత్యకామా పరబ్రహ్మలో మూడవ పాదాన్ని నేను చెబుతాను. ఆకాశంలో కనిపించే సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు అన్నీ పరబ్రహ్మ స్వరూపమే. నాల్గవ పాదాన్ని ఒక నీటి పక్షి నీకు చెబుతుంది. అని చెప్పి హంస ఎగిరిపోయింది. మరునాటి సాయంత్రం సత్యకాముడి దగ్గరకు ఒక నీటి పక్షి వచ్చి వాలి. 'సత్యకామా! పరబ్రహ్మ తత్త్వంలో నాల్గవ పాదాన్ని నీకు చెబుతాను విను. ప్రాణంబ్రహ్మ, దృష్టిబ్రహ్మ, శ్రోత్రంబ్రహ్మ' అని చెప్పింది. ఆ తరువాత సత్యకాముడికి గురువుగారైన గౌతముడు బ్రహ్మవిద్యను పూర్తిగా బోధించాడు.

ఇప్పుడు ఒక్కసారి సింహావలోకనం చెయ్యండి. పరబ్రహ్మ నాలుగు పాదాలుగా అంటే నాలుగు భాగాలుగా ఉంటుంది. అందులో

**మొదటి భాగము :** చరాచర జగత్తులోని నాలుగు దిక్కులు. ఇక్కడ నాలుగు దిక్కులు అంటే కేవలము తూర్పు, పడమర, ఉత్తరం, దక్షిణం. అని మాత్రమే కాదు. దశదిశలు అని అర్థం. ఇవన్నీ పరబ్రహ్మ స్వరూపమే.

**రెండవ భాగము :** నదీనదాలు, అడవులు, కొండలు, ఎడారులు, సముద్రాలు, పర్వతాలు, లోయలు అన్నీ పరబ్రహ్మ స్వరూపమే. అంటే ఈ భూమిమీద ఉన్న ప్రతి వస్తువు పరబ్రహ్మ స్వరూపమే.

**మూడవ భాగము :** ఆకాశంలో కనిపించే సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, మెరుపులు అన్నీ పరబ్రహ్మ స్వరూపమే.

**నాల్గవ భాగము :** ప్రాణం బ్రహ్మ, దృష్టి బ్రహ్మ, శ్రోత్రం బ్రహ్మ. అంటే శబ్ద స్పర్శ రూప రస గంధాదులన్నీ పరబ్రహ్మ స్వరూపమే.

ఈ రకంగా చూస్తే చరాచర జగత్తులో దశదిశలు, నదీనదాలు, అడవులు, కొండలు, బండలు, పర్వతాలు, లోయలు, సముద్రాలు, ఆకాశంలో ఉండే సూర్యచంద్రులు, జీవిలో ఉండే దృశ్యశక్తి, వినికిడి శక్తి, జీవము (ప్రాణము). ఇవన్నీ పరబ్రహ్మలోని భాగాలే. ఇవన్నీ కలిస్తేనే పరబ్రహ్మ. అంటే చరాచర జగత్తే పరబ్రహ్మ. బ్రహ్మమే జగత్తు. జగత్తే బ్రహ్మ. అని చెబుతోంది **ఛాందోగ్యోపనిషత్తు.** అందుకే

పరబ్రహ్మ సర్వవ్యాపి. చరాచర జగత్తుంతా వ్యాపించి ఉన్నాడు. సర్వజ్ఞుడు, సర్వవేత్త అయిన పరబ్రహ్మ విశ్వమంతా వ్యాపించి ఉన్నాడు.

సత్యకామజాబాలి విద్యాభ్యాసం పూర్తి చేసుకుని గృహస్థాశ్రమం స్వీకరించి గురుకులాన్ని స్థాపించాడు. అతడి దగ్గర ఉపకోశలుడు శిష్యరికం చేస్తున్నాడు. ఈ రకంగా పన్నెండు సంవత్సరాలు గడిచినాయి. దీక్షతో గురువుగారికి సపర్యలు చేస్తున్నాడు. అయినా గురువు గారి కటాక్ష వీక్షణాలు అతడిమీద ప్రసరించలేదు. ఉపకోశలుడితో పాటు అనేకమంది శిష్యులు సత్యకాముడి దగ్గరకు వచ్చారు. వారి అర్హతలను బట్టి వారందరికీ ఉపదేశం చేసి పంపించేశాడు సత్యకాముడు. కాని ఉపకోశలుణ్ణి మాత్రం పట్టించుకోలేదు. అతడు ఆశ్రమం వదలి వెళ్ళటానికి గురువుగారి దగ్గర నుంచి అంగీకారం ఇంకారాలేదు. గురుపత్ని కూడా ఉపకోశలుణ్ణి కనికరించ మని గురువుగారిని వేడుకుంది. మౌనం వహించాడుకాని మాట్లాడలేదు గురువుగారు.

ఒకరోజు ఏదోపనిమీద గ్రామాంతరం వెడుతూ ఉపకోశలుణ్ణి పిలిచి ఆశ్రమ ప్రాంగణంలోని అగ్నులను జాగ్రత్తగా చూస్తుండమని చెప్పాడు. ఉపకోశలుడు విచారంలో మునిగిపోయాడు. ఆహార పానీయాలు కూడా విసర్జించాడు. చివరకు రోగగ్రస్తుడు కూడా అయినాడు. అది చూసి గురుపత్ని చాలా బాధపడింది. పుత్ర వాత్సల్యంతో ఆహారం తీసుకోమని బ్రతిమాలింది. దానికి ఉపకోశలుడు "తల్లీ! నా హృదయం ఇంకా పవిత్రం కాలేదు. అందుకే గురువుగారు నన్ను ఇంకా పరీక్షిస్తున్నారు. నా హృదయంలో ఇంకా అనేకమైన దుఃసంకల్పాలుండి ఉంటాయి. నేను అన్నం ముట్టను" అన్నాడు. అతని బాధకు ఆశ్రమంలోని అగ్నులు కూడా చలించిపోయాయి. ఆ తరువాత తమలో తాము "ఈ బ్రహ్మచారి అనేక సంవత్సరాలుగా దీక్ష నవలంబిస్తున్నాడు. తపస్సు ఆచరిస్తున్నాడు. మనలను ఆరాధిస్తున్నాడు. శాస్త్రోక్తంగా తృప్తి పరుస్తున్నాడు. గురువుగారు అతడికి ఉపదేశం చెయ్యటం లేదు. పదండి మనమే ఉపదేశం చేద్దాం" ఇలా అనుకుని ఉపకోశలుని దగ్గరకు బయలుదేరాయి. ఉపకోశలుడి ఒక సందేశమిచ్చాయి. "ఉపకోశలా! ప్రాణమే బ్రహ్మ. ఆకాశమే బ్రహ్మ. ఆనందమే బ్రహ్మ అది విన్న ఉపకోశలుడు "నాకు గతంలో ప్రాణము బ్రహ్మ అని తెలుసు కాని ఆనందము, ఆకాశము బ్రహ్మ మయమని

తెలియదు" అన్నాడు. అప్పుడు అగ్నులు హృదయాకాశాన్ని గురించి వివరిస్తూ హృదయమందే బ్రహ్మతత్త్వముంటుంది. ఆనందం ఆ తత్త్వముయొక్క నిజస్వరూపము" అన్నాయి. అప్పుడు వాటిలో ఒక అగ్ని "భూమి సూర్యుడు, చంద్రుడు ఆ పరబ్రహ్మ యొక్క రూపాంతరాలే. సూర్యునిలో ఉన్న బ్రహ్మతత్త్వం, నాలో ఉన్న బ్రహ్మతత్త్వం ఒక్కటే. తూర్పు, పడమర, ఉత్తర దక్షిణాలు, నక్షత్రాలు, నీరు, నింగిలలో ఉన్న తత్త్వము, నాలో ఉన్న తత్త్వము ఒక్కటే. ఆకాశంలోని మెరుపులో ఏ తత్త్వమైతే ఉన్నదో అదే నాలోనూ ఉన్నది. చరాచర జగత్తు అంతా వ్యాపించింది. ఆ తత్త్వమే బ్రహ్మతత్త్వము. ఈ తత్త్వాన్ని అర్థం చేసుకుని బాధలను దూరం చేసుకో" అన్నది.

ఆ తరువాత గృహస్థులు ఆరాధించే గార్హపత్యాగ్ని ఒక రూపాన్ని పొంది అంతటా వ్యాపించి బ్రహ్మతత్త్వాన్ని పొంది అతనికి కనిపించింది. ఆ సమయంలో సూర్యుడు, చంద్రుడు, ఆకాశము, నక్షత్రాలు, విద్యుల్లతలు ఒకటేమిటి? జగత్తు అంతా అతడికి అగ్నిరూపమై, బ్రహ్మరూపమై సాక్షాత్కరించింది.

గ్రామాంతరం వెళ్ళిన సత్యకాముడు తిరిగి ఆశ్రమానికి వచ్చి అలవాటు ప్రకారం ఉపకోశలుణ్ణి పిలిచాడు. చెంతకు చేరిన శిష్యుని ముఖం చూడగానే ఆశ్చర్యపోయాడు. అతడి ముఖం బ్రహ్మతేజస్సును వెదజల్లుతున్నది. అప్పుడు "ఉపకోశలా! నీ ముఖం బ్రహ్మానుభూతిని పొందిన వాడిలాగా ప్రకాశవంతంగా ఉన్నది. పరబ్రహ్మతత్త్వాన్ని గురించి నీకెవరు చెప్పారు?" అన్నాడు. జరిగిన విషయమంతా వివరించాడు ఉపకోశలుడు. పరమానందభరితుడైన సత్యకాముడు తనకు తెలిసిన బ్రహ్మజ్ఞానం అంతా ఉపకోశలుడికి వివరించాడు. అతడికి అగ్ని బ్రహ్మరూపమై సాక్షాత్కరించింది.

ఇక్కడ చూడండి సూర్యుడు, చంద్రుడు, ఆకాశము, నక్షత్రాలు, విద్యుల్లతలు ఒకటేమిటి? జగత్తంతా బ్రహ్మరూపమై అతడికి సాక్షాత్కరించింది. అంటే **చరాచర జగత్తంతా పరబ్రహ్మ స్వరూపంగా కనిపించింది.** జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే.

## ౨. జీవోబ్రహ్మైవనాపరః

జీవుడు బ్రహ్మము కన్న వేరు కాదు. జీవాత్మ పరమాత్మ రెండూ ఒక్కటే. **ముండకోపనిషత్తు**లో ఒక కథ ఉంది.

పూర్వకాలంలో పాంచాల దేశంలో 'త్రిగర్త' అనే పల్లె ఉంది. అందులో 'శునకుడు' అనే పండితుడు ఉండేవాడు. ఆయన దగ్గర పాండిత్యంతో పాటుగా ధనధాన్యాలు కూడా పుష్కలంగా ఉండేవి. ఆ గ్రామంలో చాలామంది శునకుని దగ్గరే విద్యాభ్యాసం చేసేవారు. దూరప్రాంతాల నుంచి వచ్చిన విద్యార్థులకు తన ఇంట్లోనే భోజన వసతులు కూడా ఏర్పాటు చేసి విద్యను బోధించేవాడు. దీంతో ఆయన పేరు ప్రఖ్యాతులు దశదిశలా వ్యాపించాయి. పాంచాలదేశం అంతటా అతనిపేరు మారు మ్రోగింది. అతడికి దయాగుణం కూడా బాగా ఎక్కువ. నిరంతరం అతడి ఇంట్లో అతిథి సత్కారం జరుగుతుండేది. దీంతో 'ఆదర్శ గృహస్థు'గా పేరు పొందాడు శునకుడు.

శునకుని పెద్ద కుమారుడు 'శౌనకుడు'. కఠోర నియమాలతో బ్రహ్మచర్యం పాటించి తండ్రి వద్దనే విద్యాభ్యాసం పూర్తిచేశాడు. బ్రహ్మచర్య దీక్ష వదిలి గృహస్థాశ్రమం స్వీకరించాలి. ఆ సమయంలో ఒకనాడు గురువుగారి దగ్గరకు వెళ్ళి 'నాకు వివాహం చేసుకోవాలని లేదు. ఇలా బ్రహ్మచారిగానే జీవించాలనుకుంటున్నాను. గురుదేవా! దేన్ని గురించి తెలుసుకుంటే సర్వము తెలుస్తుందో, దాన్ని గురించి నాకు వివరించండి' అన్నాడు. ఆ మాటలు విన్న శునకుడు తన శిష్యుడికి బ్రహ్మవిద్యని ఉపదేశించాడు.

ఈ ఉపనిషత్తు మొత్తం మూడు భాగాలుగా ఉంటుంది. ఒక్కొక్క భాగాన్ని 'ముండకము' అంటారు. ప్రతి ముండకము మళ్ళీ రెండు ఖండాలుగా విభజించబడి ఉంటుంది. ఈ రకంగా ముండకోపనిషత్తు మూడు ముండకాలుగా, ఆరు ఖండాలుగా ఉంటుంది. ఇందులో మొత్తం 65 మంత్రాలు ఉంటాయి.

**బ్రహ్మవేద బ్రహ్మైవభవతి** బ్రహ్మమును గురించి తెలుసుకున్నవాడు సాక్షాత్తు పరబ్రహ్మమే అవుతున్నాడు. **నాస్యాబ్రహ్మవిత్కులే భవతి** బ్రహ్మవేత్త వంశమందు బ్రహ్మవేత్త కాని వాడు జన్మించడు. అని చెప్పింది ఈ ఉపనిషత్తులోనే.

శిష్యుడికి బ్రహ్మవిద్యను బోధిస్తూ 'శౌనకా ! జీవాత్మ పరమాత్మా రెండూ వేరుకాదు. జీవాత్మ పరమాత్మలు రెండూ ఒకటే.

**ద్వాసుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే ।**
**తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్య నశ్నన్నన్యో అభిచాకశీతి ॥**

శౌనకా సంసారమనే వృక్షంమీద రెండు పక్షులు కూర్చుని ఉన్నాయి. అవి ఒకే రంగు, రూపము, ఎత్తు కలిగి ఒకేలా ఉన్నాయి. అందులో ఒకటి జీవాత్మ రెండవది పరమాత్మ. జీవాత్మ తనకు దొరికిన పండ్లు కాయలు తింటున్నది. ఆ పండ్లు కాయలే జీవి చేసిన కర్మఫలాలు. రెండవ పక్షి ఏమీ తినకుండా దిక్కులు చూస్తూ ఉంది. అది పరమాత్మ. పరమాత్మ ఏ కర్మా చెయ్యదు. అందుకే ఏ ఫలితము లేకుండా దిక్కులు చూస్తూ ఉన్నది. ఈ రెండు పక్షులూ వేరువేరు అంటే కాదు. అవి జీవాత్మ పరమాత్మలు. ఆ రెండూ ఒక్కటే. మరి ఎందుకు వేరుగా ఉన్నాయి అంటే – అవి వేరుగా లేవు. నీకు అలా కనిపిస్తున్నాయి. దీనికి కారణం నీ అజ్ఞానం. నీ అజ్ఞానంవల్ల జీవాత్మ పరమాత్మలు రెండూ వేరు వేరు అనుకుంటున్నావు. అజ్ఞానం వదిలిపోతే జీవాత్మ పరమాత్మలు ఒకటిగానే కనిపిస్తుంది. అప్పుడు సంసారవృక్షం ఉండదు. దానిమీద రెండు పక్షులు ఉండవు. ఉండేది ఒక్కటే అదే పరమాత్మ." అని చెబుతాడు గురువు గారు. ఇదే మంత్రం కృష్ణయజుర్వేదానికి సంబంధించిన **శ్వేతాశ్వతరోపనిషత్తు**లోని నాల్గవ అధ్యాయంలోని ఆరవ మంత్రంగా చెప్పబడింది.

# 3. తత్త్వమసి - 1

ఇది మహావాక్యం. మహావాక్యాలు మొత్తం నాలుగు.

| | | | |
|---|---|---|---|
| 1. | ప్రజ్ఞానం బ్రహ్మ | ఐతరేయోపనిషత్తు | ఋగ్వేదము |
| 2. | అహం బ్రహ్మాస్మి | బృహదారణ్యకోపనిషత్తు | శుక్లయజుర్వేదము |
| 3. | తత్త్వమసి | ఛాందోగ్యోపనిషత్తు | సామవేదము |
| 4. | అయమాత్మాబ్రహ్మ | మాండూక్యోపనిషత్తు | అథర్వణవేదము |

నాలుగు వేదాలకు కలిపి 1180 ఉపనిషత్తులున్నాయి. వీటిలో దశోపనిషత్తులు ముఖ్యమైనవి. నాలుగు వేదాలకు సంబంధించిన ఒక్కొక్క ఉపనిషత్తు నుంచి ఒక్కొక్క వాక్యాన్ని తీసుకోవటం జరిగింది. వీటినే మహావాక్యాలు అంటారు. మహా వాక్యాలన్నింటికీ అర్థం ఒకటే. జీవాత్మ పరమాత్మల మధ్య భేదం లేదు. ఆ రెండూ ఒకటే. వీటిలో **తత్త్వమసి** అనే మహావాక్యానికి అర్థం తెలుసుకుంటే మిగిలిన మూడు మహావాక్యాలకు అర్థం తెలుస్తుంది.

ఛాందోగ్యోపనిషత్తులో ఉద్దాలకుడు తన కుమారుడైన శ్వేతకేతువుకు బ్రహ్మజ్ఞానాన్ని వివరిస్తూ "శ్వేతకేతూ! ఆకాశంలో సూర్యుడు ప్రకాశిస్తూ లోకాలన్నీ వెలుగుతో నింపుతున్నాడు. ఆ సూర్యునిలో ఏ తేజస్సయితే ఉన్నదో అదే నీలోనూ ఉన్నది. **తత్త్వమసి** అదే నీవై ఉన్నావు.

ఆకాశంలో ఉన్న చంద్రుడు లోకాలకు చల్లదనాన్నిస్తున్నాడు. ఆ చంద్రునిలో ఏ తేజస్సయితే ఉన్నదో అదే నీలోనూ ఉన్నది **తత్త్వమసి** అదే నీవై ఉన్నావు. ఈ రకంగా జగత్తులో ఉన్న ప్రతిప్రాణిలోను, ప్రతిజీవిలోను, ప్రతి వస్తువులోను ఉన్న ప్రకాశము, శక్తి అన్నీ నీలోనే ఉన్నాయి. పరబ్రహ్మ చైతన్యమువల్లనే అన్నీ ప్రకాశిస్తున్నాయి. శక్తిమంతమవుతున్నాయి. ఆ బ్రహ్మ చైతన్యమే నువ్వు. **తత్త్వమసి** అంటాడు.

**తత్త్వమసి** అనే మహావాక్యంలో మూడు పదాలున్నాయి. 1.తత్ 2.త్వం 3.అసి.

| | | |
|---|---|---|
| 'తత్' అంటే | – | అది |
| 'త్వం' అంటే | – | నీవు |
| 'అసి' అంటే | – | అయి ఉన్నావు. |

మొత్తం మీద చూస్తే **తత్త్వమసి** అనే పదానికి అదే నీవై ఉన్నావు. ఆ పరబ్రహ్మమే నీవై ఉన్నావు అని అర్థం. తత్త్వమసి అనే మహావాక్యానికి అర్థం సద్గురువు ద్వారా తెలుసుకోవాలి. మహావాక్యాలను మంత్రంగా అనుష్ఠానం చేసే సంప్రదాయం కూడా ఉంది. ఇలా చేసినవాడు మోక్షం పొందుతాడు. **శుకరహస్యోపనిషత్తు**లో వ్యాసభగవానుడు తన కుమారుడైన శుకుడికి ఉపనయనం చేస్తాడు. ఆ సమయంలో సాక్షాత్తు సదాశివుడు శుకుడికి బ్రహ్మోపదేశం చేస్తాడు. అప్పుడు శుకుడు మహావాక్యాలను ఉపదేశించమని సదాశివుణ్ణి అడుగుతాడు. అప్పుడు సదాశివుడు ఋషి, ఛందస్సు, న్యాసము, ధ్యానశ్లోకాలతో సహా తత్త్వమసి అనే మహావాక్యాన్ని ఉపదేశిస్తాడు.

స్కాందపురాణానికి సంబంధించిన **గురుగీత**లో మూడు శ్లోకాలు తత్త్వమసి అనే మహావాక్యంలోని మూడు పదాలను వివరిస్తాయి.

**అఖండ మండలాకారం । వ్యాప్తం యేన చరాచరం ।**
**తత్పదం దర్శితం యేన । తస్మై శ్రీగురవే నమః ॥**

సమస్త చరాచరములందు వ్యాపించి ఉన్న 'తత్' పదవాచ్యుడగు పరమాత్మను దర్శింపచేసే సద్గురువుకు నమస్కారము.

**స్థావరం జగమం వ్యాప్తం । యత్కించత్స చరాచరం ।**
**త్వం పదం దర్శితం యేన । తస్మై శ్రీ గురవే నమః ॥**

స్థావర జంగమాత్మకమైన జీవోపాధుల యందు వ్యాపించి ఉన్న **త్వం** పదమని చెప్పబడుతున్న జీవస్వరూపాన్ని దర్శింపచేసే సద్గురువుకు నమస్కారము.

**చిన్మయం వ్యాపితం సర్వం । త్రై లోక్యం సచరాచరం ।**
**అసిత్వం దర్శితం యేన । తస్మై శ్రీ గురవే నమః ॥**

ముల్లోకాలలోను చిద్రూపంగా వ్యాపించి ఉన్న చైతన్యాన్ని **అసి** పదం ద్వారా దర్శింపచేసే సద్గురువుకు నమస్కారము.

తత్త్వమసి అనే మహావాక్యానికి అర్థం తెలిస్తే మిగిలిన మూడు మహావాక్యాలకు అర్థం తెలుస్తుంది. అన్ని గతంలో చెప్పుకున్నాం. శంకర భగవత్పాదుల వారు **మహావాక్యదర్పణము** అనే గ్రంథం వ్రాశారు. దీనికి నేను తెలుగులో వ్యాఖ్య వ్రాశాను.

ఇందులో 170-186 వరకు మొత్తం 17 శ్లోకాలలో తత్త్వమసి అనే మహావాక్యాన్ని వివరించారు. దీని సారాంశం

సూర్యకాంతిలో ప్రకాశించే రూపాన్ని కన్ను ఎలా చూడగలుగుతున్నదో, బ్రహ్మ పదార్ధముచే ప్రకాశించే జగత్తును మనస్సు ఎలా తెలుసుకుంటుందో, ఆ బ్రహ్మమే నీవు. **తత్త్వమసి.**

జగత్తులోని అన్ని పదార్థాలకన్న అధికమైనది త్రికాలములందు ప్రకాశిస్తూ, జగత్తును ప్రకాశింపచేసేది బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

దేనిని పొందిన తరువాత ఇంక పొందవలసినది ఏదీ ఉండదో, ఏ సుఖాన్ని మించిన సుఖం ఇంకొకటి లేదో, ఏ జ్ఞానానికి మించిన జ్ఞానం ఇంకొకటి లేదో అదే బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

పరమాత్మ అంటే ఏదో ఒక రూపం కాదు. జ్ఞానరాశి. జ్ఞానరూపమే పరబ్రహ్మ. ఆ బ్రహ్మమే నీవు. **తత్త్వమసి.**

మూడు అవస్థల యందు జగత్తు దేనివల్ల ప్రకాశిస్తున్నదో అదే బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

స్వప్నంలో నేను అని భావించేది, జాగ్రదావస్థలో నేను, నాది అనిపించేది, నేను అంటే ఈ దేహము కాదు అని చెప్పేది, నిర్మలమైనది, నాశనము లేనిది బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

శరీరత్రయము, గుణత్రయము, అవస్థాత్రయము, ఇంద్రియాలు, అంతఃకరణ చతుష్టయము మొదలైన వాటితో ఉన్నప్పటికీ దేనితోను సంబంధం లేనిదే బ్రహ్మము. అదే నీవు **తత్త్వమసి.**

చరాచర జగత్తులో అన్నింటికి సాక్షియైనది బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

ఆద్యంతములు లేనిది, సర్వవ్యాపి, దేశకాల భేదములు లేనిది బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

జ్ఞానమే స్వరూపంగా గలది, అహంకారం లేనిదే బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

ఆదిమధ్యాంతములు లేనిది, శాశ్వతమైనది, అహంకారము లేనిది, నిశ్చలమైనది, నాశనము లేనిది బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

నువ్వు స్థూలశరీరానివి కాదు, సూక్ష్మశరీరానివి కాదు. కారణ శరీరానివి అంతకన్నా కాదు. నువ్వు సర్వాంతర్యామివి. పంచకోశాలలో ఉన్న జ్ఞానరూపానివి. నీవే పరబ్రహ్మవు. **తత్త్వమసి.**

జనన మరణాలు, కులగోత్రాలు, చతురాశ్రమాలు, చాతుర్వర్ణ్యాలు, ఏవీ లేనిది, సర్వానికి సాక్షియైనది బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

అజ్ఞానము, జడత్వము, జాగు చెయ్యటము, మూర్ఛ, నిద్ర, భ్రాంతి మొదలైన శరీర ధర్మాలు ఏవీ లేనిదే బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

కర్తృత్వ భోక్తృత్వాలు. అహంకార మమకారాలు ఏవీ లేనిదే బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

ఏ మాత్రము అజ్ఞానము లేని జ్ఞానరాశియే బ్రహ్మము. అదే నీవు. **తత్త్వమసి.**

వికారశూన్యుడైన పరబ్రహ్మకు సంసార బంధాలు లేవు. వాటి నుంచి విముక్తి అంతకన్నా లేదు. ఆ బ్రహ్మమే నీవు. **తత్త్వమసి.**

జగత్తులో కనుపించే అన్ని పదార్థాలు, పంచప్రాణాలు, మనస్సు, బుద్ధి, ఇంద్రియాలు, ముల్లోకాలు, గురువు, శిష్యుడు, నామరూపాలున్న ప్రతివస్తువు, ప్రతిప్రాణి, ప్రతిఅణువు పరబ్రహ్మమే. అదే నీవు. **తత్త్వమసి.**

వేదం కూడా దృశ్యమానమైనదంతా బ్రహ్మమే అని చెబుతోంది. ఆ బ్రహ్మమే నీవు. **తత్త్వమసి.**

ఈ రకంగా జగత్తులో ఉన్న ప్రతివస్తువులోను, ప్రతి ప్రాణిలోను ఉన్న శక్తి, ప్రకాశము అంతా నీలోనే ఉన్నది. అదే నీవై ఉన్నావు. చరాచర జగత్తంతా వ్యాపించిన పరబ్రహ్మమే నీవై ఉన్నావు. **తత్త్వమసి.**

ఈ విధంగా జీవాత్మ పరమాత్మ రెండూ ఒక్కటే అంటూ అద్వైత సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు భగవత్పాదులవారు.

# 4. జగత్సృష్టి

**‘చరాచర జగత్తంతా మిథ్య’**. ‘మిథ్య’ అంటే భ్రాంతి చేత కల్పించబడినది. అజ్ఞానము చేత కల్పించబడినది. మాయ. లేనిది ఉన్నట్లుగాను, ఉన్నది లేనట్లుగాను కనిపించేది. జగత్తు అనేది అసలు లేదు. కేవలము భ్రాంతివల్ల ఉన్నట్లుగా కనిపిస్తున్నది అంటోంది అద్వైత సిద్ధాంతం. మిగిలిన సిద్ధాంతాలు వేరే విధంగా చెబుతున్నాయి. అసలు జగత్తు యొక్క సృష్టిని గురించి ఎవరెవరు ఏ విధంగా చెప్పారో ముందు చూద్దాం.

మనదేశంలో **దర్శనశాస్త్రము** అని ఒకశాస్త్రం ఉన్నది. ఇది అతిప్రాచీనమైన భారతీయ తత్త్వశాస్త్రంలో ఒక భాగము అసలు **‘దర్శన శాస్త్రము’** అంటే ఏమిటి? “వేదాలలో చెప్పబడిన విషయాలను నిర్ణయించి, నిర్ధారించి చెప్పటం కోసం ఉత్పన్నమైనదే దర్శనశాస్త్రము” అన్నాడు యాస్కుడు తన నిరుక్తంలో. నిరుక్తం అంటే వేదనిఘంటువు. పూర్వకాలంలో ఎవరో ఒక మహానుభావుడు వేదంలో ఉన్న పదాలన్నింటికీ చాలా శ్రమపడి అర్థం వ్రాశాడు. అది అసలు వేదనిఘంటువు. దాన్ని వ్రాసినవారి పేరు తెలియదు. తరువాత కాలంలో **యాస్కుడు** ఆ వేదనిఘంటువుకు వ్యాఖ్య వ్రాసి **నిరుక్తము** అని పేరు పెట్టాడు. ప్రస్తుత కాలంలో నిరుక్తము అంటే – వేదనిఘంటువు. దీన్ని వ్రాసినవాడు యాస్కుడు. యాస్కుడు చెప్పిన నిర్వచనాన్నే **సత్యవ్రతస్వామి** తన **నిరుక్తలోచనము**లో చెప్పాడు.

ఆత్మను చూడు, ఆత్మను గురించి విను ఆత్మను గురించి మాట్లాడు, ఆత్మను గురించి తెలుసుకో, నిరంతరము ఆత్మను గురించి ధ్యానించు. ఈ విధంగా శ్రవణ, మనన, ధ్యానాదుల ద్వారా ఆత్మను గురించి తెలుసుకునేటట్లు చేసేదే దర్శనశాస్త్రము. మానవుణ్ణి శోకము, మోహము, రాగము మొదలైన వాటినుంచి విముక్తునిగా చేసేది దర్శనశాస్త్రము. అది బ్రహ్మవిద్య. ఆత్మవిద్య, మోక్షవిద్య. సంసార బంధాలను త్రెంచి వేసే విద్య. అయితే

దర్శనశాస్త్రాలన్నీ పరస్పరం విరుద్ధంగా ఉన్నాయి. ఒకరు చెప్పే విషయాన్ని ఇంకొకరు ఒప్పుకోరు. అందుచేతనే దర్శనాలలో జగత్ సృష్టి గురించి భిన్నమైన వాదనలు వినిపిస్తున్నాయి. దర్శనశాస్త్రము రెండు భాగాలుగా ఉంది.

1. ఆస్తిక దర్శనాలు 2. నాస్తిక దర్శనాలు.

వేదప్రమాణాన్ని అంగీకరించిన వారు ఆస్తికులు. వేదప్రమాణాన్ని అంగీకరించని వారు నాస్తికులు. ఆస్తిక దర్శనాలు మొత్తం ఆరున్నాయి.

1. కణాదుడు చెప్పినది - వైశేషిక దర్శనము
2. అక్షపాదుడు చెప్పినది - న్యాయ దర్శనము
3. కపిల మహర్షి చెప్పినది - సాంఖ్య దర్శనము
4. పతంజలి చెప్పినది - యోగదర్శనము
5. జైమిని మహర్షి చెప్పినది - పూర్వమీమాంస (కర్మ సిద్ధాంతం)
6. వ్యాస మహర్షి చెప్పినది - ఉత్తరమీమాంస

వేదాలు ప్రమాణం కావని, అభూత కల్పనలని, కొందరు స్వార్థపరులు కల్పించినవని చెప్పేవారు నాస్తికులు. వీరు వేదాలను ఒప్పుకోరు, నమ్మరు. వీరు చెప్పిన దర్శనాలే నాస్తిక దర్శనాలు. వాటిలో ముఖ్యమైనవి-

1. చార్వాకుడు ఆదిపురుషుడుగాగల - చార్వాక దర్శనము
2. జినుడు ప్రచారం చేసిన - జైన దర్శనము
3. గౌతమబుద్ధుడు ప్రతిపాదించిన - బౌద్ధ దర్శనము

# 5. ఆస్తిక దర్శనాలు

ఈ దర్శనాలన్నింటిలోను జగత్తు ఎలా సృష్టించబడింది? అనే విషయాన్ని విచారించారు. ఇప్పుడు ముందుగా సృష్టి ఎలా జరిగింది? అనే విషయం మీద ఈ దర్శనాలు ఏం చెప్పాయో చూద్దాం.

**1. వైశేషిక దర్శనము :** దీన్ని వ్రాసినవాడు కణాదమహర్షి. ఇతణ్ణే కణభోజి, కణభక్షకుడు అని కూడా అంటారు. ఇతని అసలు పేరు కశ్యపుడు. ఒకప్పుడు న్యాయ, వైశేషిక దర్శనాలు రెండూ ఒకటిగానే ఉండేవి. తరువాత కొంత కాలానికి రెండుగా విడిపోయినాయి ఉండేవి. తరువాత కొంత కాలానికి రెండుగా విడిపోయినాయి అంటారు విమర్శకులు. వైశేషికులు పరమాణువాదులు. ఈ వాదం ఇంచుమించు ఇది మన భౌతికశాస్త్రంలాగానే ఉంటుంది.

సృష్టి విషయానికి వచ్చేటప్పటికి జగత్తుకు పరమాణువులే ఉపాదాన కారణము అంటారు. పరమాణువులు నిత్యములు, శాశ్వతములు. ప్రళయ కాలంలో కూడా ఇవి నశించవు. ఇవి అతిసూక్ష్మములు. సృష్టి విషయంలో న్యా, వైశేషిక సిద్ధాంతాలు దరిదాపు ఒకటిగానే ఉంటాయి.

**2. న్యాయదర్శనము :** దీనిని వ్రాసినవాడు **అక్షపాదుడు.** ఇతడికే **గౌతముడు** అని కూడా పేరు. ఇక్కడ న్యాయము అంటే 'ఒక విషయంలో ప్రవేశించి పరిశీలించటము. జగత్తు ఎలా ఆవిర్భవించింది అనే మాటకి వీరు కూడా పరమాణు వాదాన్నే చెబుతారు.

**3. సాంఖ్య దర్శనము :** సాంఖ్య దర్శనానికి మూలపురుషుడు కపిలుడు. దేవహూతి కర్ధముల యొక్క కుమారుడు, కపిలుడు సాక్షాత్తు శ్రీమహావిష్ణువు అవతారము అని భాగవతంలో చెప్పబడింది. కాని సాంఖ్యాన్ని బోధించిన కపిలుడు, భాగవతంలోని కపిలుడు ఒకరు కాదు అన్నారు భగవత్పాదులవారు. సాంఖ్య దర్శనంలో పరిణామవాదం చెప్పబడింది. విత్తు మొలకెత్తి వృక్షం అవుతుంది. గొంగళి పురుగు శీతాకోకచిలుక అవుతుంది. వృక్షం మహావృక్షమవుతుంది. నీటిచుక్క పాయగా, అది నదిగా, ప్రవాహంగా సముద్రంగా మారుతుంది. మబ్బులు పట్టిన

ఆకాశమే కొంతసేపటికి నిర్మలమవుతుంది. బీడువారిన భూమి పచ్చగా మారుతుంది. తుఫానులో అల్లకల్లోలమైన సముద్రం కొంతసేపటికి ప్రశాంతమవుతుంది. పాలుతోడు పెడితే పెరుగవుతుంది.

ఈ రకంగా జగత్తు ప్రతిక్షణము మార్పుకు లోనవుతుంది. ఈ మార్పు (పరిణామము) వల్లే జగత్తు సృష్టించబడింది అంటారుసాంఖ్యులు. వీరి వాదానికే పరిణామవాదము అని పేరు.

**సృష్టి:** సృష్టి ఏ విధంగా జరుగుతుంది? అనే దానికి అర్థం చెప్పారు సాంఖ్యులు. పురుషుడు చైతన్యము. ప్రకృతి జడము. ఈ రెండూ కూడా విడివిడిగా సృష్టి చెయ్యలేవు. కాని ఈ రెండూ కలిస్తే సృష్టి జరుగుతుంది. మరి ఈ రెండింటి సంయోగము ఎలా జరుగుతుంది? అనేదే ప్రశ్న. దీనికి సమాధానం ఇనుపముక్క, సూదంటురాయి. ఈ రెండూ ప్రత్యేకమైన గుణాలు గలవి. కాని ఒక దానిని ఒకటి ఆకర్షించుకుంటాయి. సూదంటురాయి దగ్గరకు రాగానే ఇనుపముక్కలో చలనం కలుగుతుంది. అలాగే పురుషుని సాన్నిధ్యంమాత్రంచేతనే ప్రకృతి వికారం పొంది మహదాదులుగా మారుతుంది అంటే సృష్టి జరుగుతుందన్న మాట. ఈ సంబంధం వల్ల ప్రయోజనాన్ని వివరించటానికి కుంటివాడు, గ్రుడ్డివాడి కథ చెప్పారు. కుంటివాడికి దారి కనిపిస్తుంది కాని నడవలేడు. గ్రుడ్డివాడు నడువగలడు కాని దారి కనిపించదు. ఇద్దరూ పరస్పరం సహకరించుకుంటే ప్రయోజనం పొందగలుగుతారు. ఇరువురికీ పరస్పరాపేక్ష కలిగితే, వారి ప్రయోజనం నెరవేరటంలో సార్థకమవుతుంది. అదే విధంగా, క్రియాశీలత గల జడమైనప్రకృతి, క్రియాశీలత లేని చైతన్యంగల పురుషుడు. వీరిద్దరికీ పరస్పరాపేక్ష కలిగి, వాటి మధ్య సంబంధం ఏర్పడుతుంది. ఆ సంబంధం పరస్పర కార్యసాధకం అవుతుంది. దీనివల్ల 'ఉపయోగం ఏమిటి అంటే పురుషుడు భోక్త. ప్రకృతి భోగ్యవస్తువు. ప్రకృతి పురుషుడికి దర్శనరూపమైన భోగాన్నిస్తుంది. ఈ రకంగా అది పురుషుని అపేక్షించేది అవుతుంది. భోక్త ద్వారా అనుభవించబడినప్పుడే ప్రకృతికి సాఫల్యత ఏర్పడుతుంది. అలాగే పురుషుడు కూడా ప్రకృతిని అపేక్షించేవాడుగా ఉంటాడు. ప్రకృతితో పొందే సంబంధం వల్ల అతడికి వివేకజ్ఞానం ప్రాప్తించి మోక్షం సిద్ధిస్తుంది. అంటున్నాయి సాంఖ్యకారికలు.

సృష్టిక్రమంలో మొదటగా **మహత్తు** ఆవిర్భవించింది. ఇది సమష్టిబుద్ధి రూపం. దీనివల్లనే జీవుడికి జ్ఞాత, జ్ఞాన, జ్ఞేయ వస్తువుల జ్ఞానం కలుగుతుంది. బుద్ధియొక్క సహకారంతోనే జీవుడు నిశ్చయాత్మక జ్ఞానాన్ని పొంది అనుభవం ద్వారా తనకు, ప్రకృతికీ మధ్య గల భేదాన్ని గుర్తించగలుగుతాడు.

అయితే ప్రకృతి నుంచి జనించిన బుద్ధి కూడా త్రిగుణాత్మకమే. దానివల్లనే సాత్త్విక, రాజస, తామస బుద్ధులు ఏర్పడతాయి. ధర్మము, జ్ఞానము, రాగద్వేషాలు, ఐశ్వర్యం మొదలైన దైవీ లక్షణాలు సాత్త్వికబుద్ధికి సంబంధించినవి. కామక్రోధాలు రాజసబుద్ధికి, అలసత్వము, అశక్తత, అజ్ఞానము తామసబుద్ధికి సంకేతాలు. ప్రకృతి యొక్క మరోవికారమే అహంకారము. ఇది మహతత్త్వము నుంచి ఆవిర్భవిస్తుంది. మహతత్త్వం వల్ల ఏర్పడ్డ బుద్ధిలో నేను, నాది అనే అభిమానమే అహంకారము. జీవి ఈ అహంకారానికి లోనై భ్రమకు గురి అవుతాడు. అన్నింటికీ తాను కర్తని అనుకుంటాడు. తానే యజమాని అనుకుంటాడు. ఇంద్రియాలవల్ల విషయజ్ఞానం ప్రత్యక్షంగా కలుగుతుంది. అంటే ఇంద్రియాల ద్వారా వస్తువులను తెలుసుకోగలుగుతాము. అప్పుడు మనసు ఆ వస్తువులను గురించి ఆలోచిస్తుంది. ఆ తరువాత అహంకారంతో సంబంధం కలిగి ఇది నాది అనే భావన కలిగిస్తుంది. ఈ రకంగా జీవికి సంసారిక విషయాలతో సంబంధం ఏర్పడుతుంది. తద్వారా జీవి వివిధ కర్మలయందు ప్రవృత్తుడవుతాడు అని చెబుతున్నారు సాంఖ్యకారులు.

తెల్లనిదారంతో తయారుచేసినబట్ట ఎలా తెల్లగాఉంటుందో, అలాగే త్రిగుణాలకి అనుగుణంగా ఏర్పడ్డ సృష్టి కూడా మూడు రకాలుగానే ఉంటుంది. సాంఖ్యుల ప్రకారము అహంకారము మూడు రకాలు. అవి

**1. సాత్త్వికాహంకారము :** ఇందులో సత్త్వగుణం పాలు ఎక్కువగా ఉంటుంది. చెవి, కన్ను, ముక్కు, నాలుక, చర్మము అనే జ్ఞానేంద్రియాలు దీనివల్ల ఏర్పడతాయి. వీటివల్ల శబ్ద స్పర్శ రూప రస గంధాదులు తెలుస్తాయి.

చెవివల్ల – శబ్దము, చర్మమువల్ల – స్పర్శ, కన్నువల్ల – రూపము, నాలుకవల్ల – రసము (రుచి) ముక్కువల్ల – గంధము (వాసన) తెలుస్తాయి.

**2. రాజసాహంకారము :** ఇందులో రజోగుణం ఎక్కువగా ఉంటుంది. దీని నుండి వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థ. అనే కర్మేంద్రియాలు ఏర్పడతాయి. వాక్కువల్ల – మాట్లాడటము, చేతివల్ల – తీసుకోవటము, కాలువల్ల – నడవటము, పాయువు వల్ల – విసర్జన, ఉపస్థవల్ల – ఆనందించటము జరుగుతుంది.

ఈ రకంగా దశేంద్రియాలు ఏర్పడ్డాయి. అంతఃకరణ అనే పేరుతో మనస్సు పదకొండవ ఇంద్రియముగా ఏర్పడుతుంది. ఈ మనస్సు జ్ఞానేంద్రియాలతో కలిసినప్పుడు విషయాలను గ్రహిస్తుంది. కర్మేంద్రియాలతో కలిస్తే పని చేస్తుంది. ఈ విధంగా ఇది ఉభయేంద్రియమవుతున్నది.

**3. తామసాహంకారము :** ఇందులో తమోగుణం ఎక్కువగా ఉంటుంది. దీనివల్ల పంచతన్మాత్రలు, వాటి నుంచి పంచభూతాలు ఆవిర్భవిస్తాయి. శబ్దము ఆకాశము యొక్క గుణము, శబ్దము, స్పర్శ వాయువు గుణాలు. శబ్దము, స్పర్శ, రూపము అగ్ని యొక్కగుణాలు. శబ్దము, స్పర్శ, రూపము, రసము, జలముయొక్క గుణాలు. శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధము అనేవి భూమియొక్క గుణాలు.

ఈ రకంగా 1. ప్రకృతి 2. మహత్తత్త్వము. అహంకారము, పదకొండు ఇంద్రియాలు, పంచతన్మాత్రలు, పంచభూతాలు మొత్తం ఇరవై నాలుగు తత్త్వాలు ఆవిర్భవిస్తున్నాయి. ఇందులో ఇరవైఐదవ తత్త్వము పురుషుడు. ఇది సాంఖ్య సిద్ధాంతము. ఈ సిద్ధాంతాన్ని వాచస్పతిమిశ్రుడు కూడా ఒప్పుకున్నాడు. కాని విజ్ఞాన భిక్షువు సృష్టిక్రమాన్ని వేరుగా చెప్పాడు. ఇతని ప్రకారం మనస్సు సత్త్వగుణ ప్రధానమైనది. ఇది సాత్త్వికాహంకారం నుంచి ఆవిర్భవించింది. మిగిలిన పది ఇంద్రియాలు రాజసాహంకారం యొక్క పరిణామాలు. ఇక పంచతన్మాత్రలు తామసాహంకారం నుంచి పుట్టాయి. జ్ఞానేంద్రియాల ద్వారా తన్మాత్రల జ్ఞానం కలుగుతుంది. ఇవి పురుషుని కోసం ఉత్పన్నమైన అహంకార పరిణామాలు. పురుషుడిలో కలిగే భోగేచ్ఛ వల్ల ఇంద్రియాలు ఉత్పత్తి అవుతాయి. కర్మేంద్రియాల వల్ల నడవటం, తీసుకోవటం, మాట్లాడటం, విసర్జన, సంతానోత్పత్తి చేస్తాడు. ఇంద్రియాలు అంటే శరీరంలో కన్ను ముక్కు నోరు చెవులు కాదు. అవి కంటికి కనిపించని శక్తులు. అవి ఆ అవయవాల ద్వారా పనులను చేస్తాయి. అందువల్ల

ఇంద్రియాలు 'అనుమేయాలు' అవి సాంఖ్యసూత్రాలలోను, తత్త్వకౌముదిలోను చెప్పటం జరిగింది.

మిగిలిన ఇంద్రియాలతో పాటుగా మనసు కూడా ఒక ఇంద్రియమే. అయితే అది మన కంటికి కనిపించకుండా ఉంటుంది. జ్ఞానేంద్రియాలకు, కర్మేంద్రియాలకు సహకరించి, ఆ కర్మలలో వాటిని ప్రేరేపిస్తుంది. మనస్సనేది మహాసూక్ష్మమైన ఇంద్రియము. ఒకే కాలంలో అన్ని ఇంద్రియాలతోను కలిసిపోగలుగుతుంది. బయటి విషయాలు ఇంద్రియాల ద్వారా మనస్సును చేరి, ఒక రూపాన్ని పొంది, అహంకారం చేత వేరు వేరుగా విభజించబడి, బుద్ధిచేత అది ఇటువంటిదని నిర్ధారించబడుతుంది. పురుషుని ఉద్దేశ్యానికి తగ్గట్లుగా వాటిపట్ల రాగ ద్వేషాలను కలిగిస్తుంది.

ఈ విధంగా సృష్టి రెండు దశలలో జరుగుతుంది. మొదటిదశలో జరిగే సృష్టిని బుద్ధివర్గము అంటారు. రెండవదశ తన్మాత్రవర్గము. మొదటి దశలో బుద్ధి, అహంకారము, మనస్సు, జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు ఆవిర్భవిస్తాయి. రెండవ దశలో తన్మాత్రలు, పంచభూతాలు ఆవిర్భవిస్తాయి. తన్మాత్రలు అత్యంత సూక్ష్మాలు. అప్రత్యక్షాలు. భౌతికతత్త్వమంతా దీని నుంచి జరిగే మార్పు, విశేషధర్మాలు, లక్షణాలు కలిగి ఉంటుంది. అందువల్ల ఇది విశేషము అని పిలువబడుతుంది. ఈ విశేషం మూడు రకాలు 1. స్థూల మహాభూతాలు 2. స్థూలశరీరం 3. సూక్ష్మశరీరం.

కొందరి అభిప్రాయంలో స్థూలశరీరం నాలుగు భూతాలవల్ల ఏర్పడుతుంది. జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, తన్మాత్రలు, బుద్ధి, అహంకారము, మనస్సుల వలన సూక్ష్మశరీరం ఏర్పడుతుంది. సూక్ష్మశరీరానికి స్థూలశరీరం ఆశ్రయం. ఇది **వాచస్పతిమిశ్రుని** అభిప్రాయం. కాని స్థూల, సూక్ష్మశరీరాలే కాకుండా అధిష్ఠాన శరీరము కూడా ఉన్నది అంటాడు విజ్ఞానభిక్షువు. సూక్ష్మశరీరం ఒక శరీరాన్ని వదిలి రెండో శరీరాన్ని ఆశ్రయించేటప్పుడు, ఆ రెండో శరీరమే అధిష్ఠానశరీరము అవుతుంది. ఈ రకంగా ఇరవై నాలుగు తత్త్వాలతో ఆవిర్భవించిన ఈ జగత్తులోని ఆత్మలన్నీ గుణత్రయాన్ని, పుణ్యపాపాలను అనుసరించి ప్రళయకాలంలో సూక్ష్మదేహాలతో ప్రకృతిలో లీనమై ఉంటాయి. ఈ జగత్తంతా సూక్ష్మరూపంతో ప్రకృతిలోనే ఉన్నది. సృష్టికాలంలో మూలప్రకృతి నుంచి అభివ్యక్తమవుతుంది.

జగత్తంతా సత్పదార్థమే. ఇక్కడ కారణమైన ప్రకృతి, కార్యమైన జగత్తు కూడా సత్పదార్థలే అంటే సత్పదార్థం నుంచి సత్పదార్థం పుడుతున్నదని సాంఖ్యశాస్త్రం చెబుతున్నది. సాంఖ్యులు ప్రత్యక్ష, అనుమాన, శబ్ద ప్రమాణాలు మాత్రమే అంగీకరించారు.

**4. పతంజలి యోగదర్శనము :** యోగదర్శనాన్ని చెప్పినవాడు పతంజలి మహర్షి. మానవుడికి అంతఃదృష్టి సామర్థ్యాన్ని కలగజేసేది యోగశాస్త్రము. ఇది అనుష్ఠాన ప్రాధాన్యత గల శాస్త్రము. సాంఖ్యప్రవర్తకులు ఎక్కడ ఆగిపోయారో, అక్కడ నుంచి మొదలవుతుంది యోగశాస్త్రము. సాంఖ్యులు "ప్రకృతి పురుషుల సంయోగము బంధహేతువు. ప్రకృతి పురుషుల వివేకఖ్యాతి బంధవిముక్తికి ఏకైక మార్గము. ఈ వివేక ఖ్యాతి కావాలంటే యోగసాధన చెయ్యాలి" అని చెప్పి అక్కడ ఆగిపోయారు. యోగశాస్త్రం ఆ యోగాన్ని వివరించి 'యోగదర్శనము' అయింది. సాంఖ్యులు చెప్పిన 24 తత్త్వాలకు ఇంకొకటి కలిపి భగవంతుడు అనే 25వ తత్త్వాన్ని చెప్పారు యోగులు. అంతేకాకుండా సాంఖ్యులు చెప్పిన తత్త్వాలను సాక్షాత్కరించుకునే మార్గం కూడా యోగదర్శనంలో చెప్పబడింది.

ఈ రకంగా యోగదర్శనానికి సాంఖ్యదర్శనానికి గట్టి సంబంధం ఉన్నది. సాంఖ్యదర్శనంలో భగవత్ప్రసక్తి లేదు. యోగదర్శనంలో భగవంతుణ్ణి అంగీకరించారు.

ఓంకారోపాసనతోనే భగస్సాక్షాత్కారముసాధ్యము అన్నాడు పతంజలి. యోగసాధనలో అష్టాంగ యోగాన్ని ప్రతిపాదించాడు.

**యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార**

**ధారణ, ధ్యాన, సమాధయో అష్టాంగాని** (2-29)

అంటున్నాయి యోగసూత్రాలు. చిత్తంలో మాలిన్యం నశిస్తే, చిత్తం పరిశుభ్ర మవుతుంది. అప్పుడు పురుషుడికి ఆత్మజ్ఞానం కలుగుతుంది. దీనికోసం అష్టాంగ మార్గం అనుసరించాలి అంటాడు పతంజలి. యోగాంగాలు ఎనిమిది

1. యమము
2. నియమము
3. ఆసనము
4. ప్రాణాయామము
5. ప్రత్యాహారము
6. ధారణ
7. ధ్యానము
8. సమాధి

వీటిలో మొదటి ఐదింటినీ **యమాదిపంచకము** అని మిగిలిన మూడింటినీ **సంయమము** అని అంటారు.

**5. పూర్వమీమాంసాదర్శనము :** దీన్ని చెప్పినవాడు జైమిని. ఇతడు సాక్షాత్తు వ్యాసమహర్షి శిష్యుడు. కల్పాంతాన పరమేశ్వరుడు జగత్తును లయం చేసి, తిరిగి సృష్టి చేస్తాడనే మాటను ఈ దర్శనము అంగీకరించదు. జగత్తులోనే పరిణామము, ప్రళయము అనేవి రెండూ నిత్యమై ఉన్నాయి. జగత్తులో కొంత భాగానికి మాత్రమే సృష్టి లయము ఉన్నాయి. అంతేకాని జగత్తు మొత్తానికి సృష్టి ప్రళయము లేవు అంటారు. జగత్తనేది మిథ్యకాదు. సత్యము అంటారు. న్యాయవైశేషికులలాగానే వీరు కూడా అణువాదులే.

**6. ఉత్తరమీమాంస :** దీన్నే వేదాంతదర్శనము అంటారు. వేదాంతదర్శనము దీన్ని చెప్పినవాడు వ్యాసభగవానుడు. అన్ని దర్శనములలోకి పరమశ్రేష్ఠమైనది. దీని యొక్క గొప్పతనము క్రింది శ్లోకంలో వివరించబడింది. ఈశ్వరుడే సృష్టి చేశాడు అంటాడు వ్యాసుడు.

**తావద్గర్జంతి శాస్త్రాణి జంబుకావిపినే యథా ।**
**నగర్జతి మహాశక్తిః యావద్వేదాంత కేసరీ ॥**

'సింహం గర్జించే దాకానే అడవిలో నక్కలు కూస్తుంటాయి. సింహగర్జన వినబడగానే నక్కలు కూయటం మానేస్తాయి. అలాగే వేదాంతదర్శనము అనే సింహం గర్జించగానే వేదాంత దర్శనము రాగానే తక్కిన శాస్త్రములు అనే నక్కలు మౌనంగా ఉండిపోతాయి. మిగిలిన శాస్త్రాలన్నీ వీగిపోతాయి.

వేదాంతదర్శనము అంటే **ఉత్తరమీమాంస.** దీన్నే **బ్రహ్మమీమాంస** అని కూడా అంటారు. వేదాంతాన్ని తెలియజేసే గ్రంథాలు మూడు. అవి 1. ఉపనిషత్తులు 2. భగవద్గీత 3. బ్రహ్మ సూత్రాలు. ఈ మూడింటికీ శంకరాచార్యులు, రామానుజులు, మధ్వాచార్యులు. వీరు ముగ్గురూ తమ మతాలకు అనుకూలంగా భాష్యాలు వ్రాశారు.

# 6. నాస్తిక దర్శనాలు

దర్శనశాస్త్రం రెండు భాగాలుగా ఉంది. 1. ఆస్తికదర్శనాలు 2.నాస్తికదర్శనాలు. వేదప్రమాణాన్ని అంగీకరించిన వారు ఆస్తికులు. వేదప్రమాణాన్ని అంగీకరించని వారు నాస్తికులు. ఇప్పటి వరకు మనం చూసినవి ఆస్తిక దర్శనాలు. ఇప్పుడు నాస్తిక దర్శనాలు చూద్దాం. నాస్తికులు వేదప్రమాణాన్ని నిరాకరిస్తారు. వేదంలో పునరుక్తి దోషాలున్నా యంటారు. వీరి దృష్టిలో వేదాలు అభూత కల్పనలు. కొందరు స్వార్థపరులు కల్పించినవి. వీరు చెప్పినవే నాస్తికదర్శనాలు. వీటిలోముఖ్యమైనవి 1.జైనదర్శనం 2.బౌద్ధదర్శనం 3.చార్వాకదర్శనం. జగత్సృష్టి విషయంలో వీరేం చెప్పారో చూద్దాం.

**1. జైనదర్శనము :**

విజయం అంటే రణక్షేత్రం, రక్తపాతం కాదు. గెలవడం. తనలోని శత్రువులను, మాలిన్యాలను తుదముట్టించడం. తన పై తాను యుద్ధం ప్రకటించుకుని అందులో గెలవాలంటే అపారమైన ఆత్మశక్తి కావాలి. 'ఆ యుద్ధంలో గెలిచినవాడే రాజవుతాడు'. అంటుంది జైనధర్మం.

జినుడు అంటే జయించినవాడు. ఇంద్రియాలను జయించిన వాణ్ణి **జినుడు** అంటారు. తేలికగా చెప్పాలంటే అంతరింద్రియ బాహ్యేంద్రియ నిగ్రహం కలవాడు. శమదమాది గుణాలు కలవాడు మాత్రమే జినుడు అనబడతాడు. జినుణ్ణి అనుసరించిన వారు జైనులు.

స్వాయంభువ మనువు వంశంలో ఐదవవాడు **ఋషభుడు.** ఇతడే జైనమత స్థాపకుడు. మొదటి తీర్థంకరుడు కూడా. తీర్థంకరుడు అంటే ప్రవక్త అని అర్థం. ఈ మతంలోని తీర్థంకరులందరూ క్షత్రియులే. ఇద్దరు తప్ప అందరూ ఇక్ష్వాకు వంశానికి చెందిన వారే. వీరిలో 24వ తీర్థంకరుడు **వర్ధమాన మహావీరుడు.**

ఈ జగత్తు ఎలా ఆవిర్భవించింది? అనే ప్రశ్నకు జైనమతంలో సమాధానం లేదు. జగత్తు అనాదిగా ఉన్నది అని వీరి సిద్ధాంతం. అది దేని నుండీ ఆవిర్భవించ

లేదు. వికారం పొందలేదు. జగత్తును ఈశ్వరుడు సృష్టించలేదు. "స్వతంత్రమైన అణుపదార్థాల కలయిక వల్లనే జగత్తు ఏర్పడింది" అంటారు.

### 2. బౌద్ధ దర్శనము

బౌద్ధమతాన్ని ప్రచారం చేసినవాడు బుద్ధుడు. శాక్య వంశస్థుడైన శుద్ధోదనుని కుమారుడు. ఇంద్రియ గోచరమైనది, శాస్త్రములందు చెప్పబడినది అయిన జగత్తు ఎలా ఆవిర్భవించింది? జగత్తు నిత్యమా? అనిత్యమా? అనే ప్రశ్నలకు బుద్ధ భగవానుడు సమాధానం చెప్పలేదు. భూమి, జలము, అగ్ని,వాయువులు నాలుగే భూతాలు. ఆకాశాన్ని వీరు భూతముగా ఒప్పుకోరు. లోకము ప్రతిక్షణము మార్పు చెందుతూ ఉంటుంది. మార్పు చెందని వస్తువు ఏదీ లోకంలో లేదు. ప్రవహించే నదీతీరాన నుంచుని ఒక్కక్షణం ఆ ప్రవాహం మీద దృష్టి నిలిపితే, ఈ క్షణంలో మనం చూసిన నీరు మరుక్షణంలో అక్కడ ఉండదు. ఆ ప్రదేశంలో క్రొత్త నీరు వచ్చి చేరుతుంది. కాని మనకంటికి మాత్రం ఎడతెగని జలప్రవాహము కనిపిస్తుంది. జగత్తులో అన్నీ ఇలాగే జరుగుతున్నాయి. సమస్తము ఎడతెగని మార్పుకు లోనవుతూ ఉంటుంది. దీనికి ఒక్క చిన్న ఉదాహరణ చెప్పారు బౌద్ధులు. ఒక ప్రమిదలో నూనె వేసి, అందులో వత్తిని వేసి వెలిగించితే దీపం వెలుగుతంది. కాని ఇక్కడ గమనించాల్సిన విషయం ఏమంటే – దీపం వెలుగుతున్నప్పటికీ, అగ్నిజ్వాల యెడతెగక కాంతులు ప్రసరింపచేస్తున్నా, ప్రతిక్షణము అది ఒకే జ్వాలకాదు. ముందు కనిపించిన జ్వాల నశించిపోకుండానే క్రొత్త జ్వాల దాని స్థానాన్ని ఆక్రమిస్తోంది. దీనివల్ల దీపం అఖండంగా వెలుగుతున్నట్లుగా మనకు కనిపిస్తుంది. అంతే నీటి ప్రవాహంలోని నీటిబుడగలు లాగానే లోకము జనన మరణాల మధ్య పుడుతూ–గిడుతూ ఉంటుంది.

జగత్తంతా అనిత్యము, అశాశ్వతము అన్నాడు బుద్ధుడు. బుద్ధుని తరువాత ఆయన శిష్యులు 'సర్వము క్షణికము' అన్నారు.

### 3. చార్వాక దర్శనము

దర్శనశాస్త్రాల్లో పూర్తిగా అవైదికమైనది చార్వాక దర్శనము. ఇది చాలా పురాతనమైనది. దీన్ని చెప్పినవాడు బృహస్పతి. ప్రచారం చేసినవాడు 'చార్వాకుడు' జీవితం శాశ్వతం కాదు. కాబట్టి బ్రతికినంత కాలం సుఖంగా జీవించు అంటారు చార్వాకులు. వీరు ఈశ్వరుణ్ణి నమ్మరు. చతుర్విధ పురుషార్థాలలోని అర్థకామాలకే ఎక్కువ ప్రాముఖ్యత ఇస్తారు. వీరు ప్రత్యక్ష ప్రమాణం మాత్రమే నమ్ముతారు. కంటికి కనిపించని దేవుడు ఉన్నాడని చెప్పటానికి వీల్లేదు. దేవుడిని చూసిన వారెవరూ లేరు కాబట్టి దేవుడు లేడు అంటారు. పంచభూతాలలో ఆకాశాన్ని ఒప్పుకోరు. వీరి ప్రకారం భూతాలు నాలుగే. పసుపు, సున్నము కలిపితే పారాణి అవుతుంది. పసుపుకి, సున్నానికి లేని ఎరుపురంగు పారాణికి వస్తుంది. ఆకు, వక్క, సున్నం కలిస్తే ఎరుపు రంగు వచ్చినట్లుగానే కొన్ని పదార్థాల కలయిక వల్ల ఈ జగత్తు ఏర్పడింది అంటారు చార్వాకులు.

# 7. వేదాలు-జగత్సృష్టి

జగత్తు యొక్క సృష్టి ఎలా జరిగింది? అన్నప్పుడు పరమాత్మే ఈ జగత్తును సృష్టించాడని చెబుతోంది ఋగ్వేదం. ఋగ్వేదంలోని 10వ మండలంలో 81, 82 సూక్తాలు ఈ విషయాన్ని చెబుతున్నాయి. ముందుగా 81వ సూక్తం.

విశ్వకర్మ మాకు తండ్రి. అతడు సకల భువనాలు హవనము చేశాడు. తాను కూడా స్వయంగా అగ్నిలో ప్రవేశించాడు. సకల లోకాలను అగ్నికి ఆహుతి చేశాడు. ఆ తరువాత తాను కూడా హతమై పోయాడు.

ఇక సృష్టికాలంలో విశ్వకర్మ ఈ సృష్టి ఎలా చేశాడు? అతడు ఎక్కడ నుంచుని భూమిని, ఆకాశాన్ని సృష్టించాడు? అంటే ఆయన యొక్క నేత్రాలు, ముఖము, చేతులు, కాళ్ళు అన్ని దిశలందు వ్యాపించి ఉన్నాయి. ఆ దివ్య పురుషుడు తన కరచరణములచే (కాళ్ళు చేతులతో) భూమి, ఆకాశాలను సృష్టించాడు. అతడు మాత్రం ఒక్కడే. మళ్ళీ ఇంకో ప్రశ్న. సృష్టికర్తలయిన ద్యావాపృథ్వులు ఏ చెట్టుతో ఈ జగత్తును నిర్మించారు? దేనిమీద నుంచుని ఈశ్వరుడు ఈ సకల జగత్తును సృష్టించాడు? ఈ ప్రశ్నకి సమాధానము పరమాత్మ అనే వృక్షంతో ఈ జగన్నిర్మాణము జరిగింది అని గతంలో చెప్పుకున్నాం. 81వ సూక్తంలోని 5,6,7 మంత్రాలలో విశ్వకర్మను ప్రార్థిస్తున్నారు. ఓ విశ్వకర్మా ! మాకు ఉత్తమ, మధ్యమ, అధమ దేహాలను చూపవలసింది. ఇక్కడ మూడు రకాల దేహాలు ఏమిటి? అంటే

1. ఉత్తమ భూతాని – దేవశరీరాణి
2. మధ్యమభూతాని – మనుష్య శరీరాణి
3. అధమభూతాని – పశుపక్ష్యాదీని
4. నికృష్ట భూతాని – క్రిమికీటకాది శరీరాణి

1. ఉత్తమ భూతాలు – దేవతలు 2. మధ్య భూతాలు – మానవులు 3. అధమభూతాలు – పశువులు, పక్షులు 4. నికృష్ట భూతాలు – క్రిమికీటకాదులు అంటున్నాడు సాయణుడు.

ఓ విశ్వకర్మా ! నువ్వు ఈ భూమ్యాకాశాలలో యజ్ఞం చేశావు. స్వయంగా సృష్టికర్తవు.

ఇప్పుడు **82వ సూక్తం చూడండి.**

విశ్వకర్మ మొదట జలాన్ని సృష్టించాడు. ఆ తరువాత ద్యావాపృథ్వులను సృష్టించాడు. ఇప్పుడు స్థావరజంగమాత్మక జగత్తు ఏర్పడింది. అప్పుడు ఋషులు ప్రాణులకు ధనాదులు సమకూర్చారు. ఆ ఋషులే యజ్ఞయాగాలు చేశారు. ఇది ద్యులోకము ఇది భూలోకము. ఇవి దేవతలను రాక్షసులను అతిక్రమించి ఉన్నాయి. విశ్వకర్మ వల్ల ఈ జలము గర్భం దాల్చింది. ఆ గర్భంలో దేవతలందరూ ఉన్నారు. ఆ విశ్వకర్మ జనన మరణాలు లేనివాడు. అతని నాభియందు ఈ బ్రహ్మాండమంతా ఉన్నది. ఆ బ్రహ్మాండములోనే ప్రాణులన్నీ ఉన్నాయి. ఈరకంగా అన్ని లోకాలను సృష్టించిన విశ్వకర్మను మీరు ఎరుగరు. మీ బుద్ధికి అతణ్ణి గురించి తెలుసుకునే శక్తి లేదు. మంచు పొరలాంటి అజ్ఞానము ఆవరించిన ప్రజలు నానాకల్పనలు చేస్తున్నారు. వారు కేవలము ఐహికసుఖాల కోసమే ఆలోచిస్తున్నారు. అంతేకాని తాత్త్విక విషయాల గురించి ఆలోచించరు. ఈ చరాచర జగత్తును సృష్టించింది ఆ పరమేశ్వరుడే అనే విషయాన్ని తెలుసుకోలేరు. అని చెబుతోంది.

చరాచర జగత్తు రెండు రకాలుగా ఏర్పడింది అని చెబుతోంది వేదం. 1. వడ్రంగులు మొదలైన వారంతా చేరి ఈ జగత్తును నిర్మించారు. 2. జగత్తు సహజంగానే ఏర్పడింది. ఈ జగత్తును నిర్మించటం కోసం ఇంద్రుడు ఆరు ప్రదేశాలు కొలిచాడు. విశాలమైన భూమిని, పైకప్పుని వేశాడు. విష్ణువు భూమికి సంబంధించిన ప్రదేశాలన్నింటినీ కొలిచాడు. ఇక్కడ కొలిచే సాధనం ఏమిటి అన్నప్పుడు ఆ సాధనం సూర్యుడు అని చెప్పారు. మరి కొలిచేవాడు వరుణుడు. పితృదేవతలు రెండు లోకాలను కొలిచి విశాలమైనవిగా చేశారు. భూమిని కొలవడం అనేది తూర్పునుంచి మొదలవుతుంది. అగ్ని, ఇంద్రుడు మరుత్తులు అందరూ ఈ పనిచేశారు. ఈ జగత్తును కలపతోనే కట్టారు. వేదంలో ఒకచోట "భూమి, స్వర్గము ఏ చెట్టు కర్రతో చెయ్యబడ్డాయి" అని అడిగారు. దీనికి సమాధానం తైత్తిరీయ బ్రాహ్మణంలో "బ్రహ్మ అనే చెట్టు" అని సమాధానం వచ్చింది. స్వర్గానికి భూమికీ ఆధారంగా స్తంభాలున్నాయి. కాని ఆకాశానికి మాత్రం వాసాలు లేవు. 'ఆతా' అనేది ద్వారము లేదా ద్వారబంధానికి పేరు. ప్రపంచం అనే ఇంటికి ద్వారం తూర్పు. ఇందులోంచే

ఉషస్సు (కాంతి) లోపలకు ప్రవేశిస్తుంది. సవిత భూమిని తాళ్ళతో గట్టిగా కట్టేశాడు. విష్ణువు కొయ్యముక్కలతో దాన్ని బిగించాడు. బృహస్పతి దాని చివరలని మోస్తాడు. ఈ జగన్నిర్మాణానికి కర్తలు దేవతలు. కాని వృత్తి నైపుణ్యంగల వారు దేవతల వడ్రంగులు త్వష్ట, ఋభువులు అని చెప్పబడింది. ఋగ్వేదం ఆఖరి మండలంలో జగత్సృష్టికి సూర్యుడు ముఖ్యమైన దేవత అని చెప్పబడింది. సూర్యుడు హిరణ్యగర్భుడు అనే పేరుతో ప్రసిద్ధి చెందాడు. ఆయనే ప్రజలకు అధిపతి ప్రజాపతి అని చెప్పబడింది.

ఋగ్వేదంలో అసత్ నుంచి సత్ వచ్చింది. ఏమి లేని దాన్నుంచి ఈ జగత్తు ఆవిర్భవించింది అని చెప్పబడింది. బ్రహ్మణస్పతి కమ్మరిలాగా ఈ జగత్తుకు ఒక రూపం ఏర్పరిచాడు. లేనిదాన్నుంచి ఉన్నది పుట్టించబడింది. ఆ తరువాత వరుసగా భూమి, శూన్యప్రదేశాలు, దక్షుడు, అదితి పుట్టారు. అదితి తరువాత దేవతలు పుట్టారు. ఆ తరువాత దేవతలు సూర్యుణ్ణి సృష్టించారు. అదితికి ఎనిమిది మంది కుమారులు. ఎనిమిదవ వాడు ఆదిత్యుడు. అదితి అతన్ని పారేసింది. అతన్ని కేవలము ఉదయించటానికీ, అస్తమించటానికే పుట్టించింది. ఇక్కడ ముందుగా జగత్తు, తరువాత దేవతలు, తరువాత సూర్యుడు పుట్టారు అని చెప్పబడింది.

ఋగ్వేదంలోని **పదవ మండలంలోని 72వ సూక్తంలో**

సృష్టి ప్రారంభంలో బ్రహ్మణస్పతి కర్మకారుడిలాగా దేవతలను సృష్టించాడు. అసత్ నుంచి సత్ ఉత్పన్నమైంది.

దేవతల సృష్టికన్న ముందే అసత్ నుంచి సత్ ఉత్పన్నమైంది.

ఆ తరువాత దిశలు. దిశల నుంచి వృక్షాలు వచ్చినాయి.

వృక్షాలనుంచి పృథివి, పృథివి నుంచి దిశలు వచ్చినాయి. అదితి నుంచి దక్షుడు, దక్షుని నుంచి అదితి ఉత్పన్నులైనారు. దక్షా ! నీ పుత్రిక అదితి దేవతలకు జన్మనిచ్చింది. దేవతలు అమరులు. స్తుతించ తగినవారు.

దేవతలు జలములందుండి మహోత్సాహంగా నాట్యం చేశారు. అందువల్ల ధూళి లేచింది.

దేవతలు మేఘాలలాగా అన్ని లోకాలు ఆవరించారు. సూర్యుడు నిగూఢముగా ఉన్నాడు. దేవతలు అతన్ని ప్రకాశింపచేశారు.

అదితికి ఎనిమిది మంది కుమారులు. వారు 1. మిత్ర 2. వరుణ 3. ధాత 4. ఆర్యమ 5. అంశ 6. భగ, 7. వివస్వత 8. ఆదిత్యులు వారిలో ఎనిమిదవ వాడైన ఆదిత్యుణ్ణి ఆకాశంలో వదిలి మిగిలిన ఏడుగురిని తీసుకుని దేవలోకానికి వెళ్ళింది అదితి. జనన మరణములకు అంటే ఉదయించటం అస్తమించటం కోసం ఆదిత్యుణ్ణి ఆకాశంలో వదిలేసింది. అని చెప్పబడింది. **పదవ మండలంలోని 81వ సూక్తంలో** విశ్వకర్మ నేత్రాలు, విశ్వకర్మ ముఖము, బాహువులు, పాదములు అన్ని దిశలందు ఉన్నాయి. ఆ దివ్యపురుషుడు తన కరచరణాదులతో ద్యావాపృథువులను సృష్టించాడు అని చెప్పి తరువాత మంత్రంలో ద్యావాపృథివులు ఏ వృక్షముతో చేయబడినారు. ఓ విద్వాంసులారా ! మీరే ఆలోచించండి అన్నారు. **82వ సూక్తంలో** విశ్వకర్మ శరీరాలను సృష్టించాడు. మొదట జలాన్ని, తరువాత ద్యావాపృథువులను సృష్టించాడు. ఆయనే సకల భువనకర్త. దేవతలకు పేర్లు పెట్టాడు. అని చెప్పబడింది. **పదవ మండలంలోని 129వ సూక్తంలో** "ప్రళయం జరిగినప్పుడు సత్తు లేదు అసత్తు లేదు. భూమి లేదు ఆకాశం లేదు. లోకాలు లేవు. అంతా జలమయంగా ఉంది. అప్పుడు మృత్యువు లేదు. అమరత్వం లేదు. రాత్రి లేదు. పగలు లేదు. అంతా శూన్యము. పరబ్రహ్మ ఒక్కడే ఉన్నాడు. అతడు తప్ప ఇంకేదీ లేదు. సృష్టికి పూర్వము అంతా అంధకారం అలముకుని ఉన్నది. అంతా జలమయము. ముందుగా మనసులో కోరిక పుట్టింది. దానిలోంచి బీజము వచ్చింది. అదృశ్యము నుంచి దృశ్యపదార్థము అవతరించింది. బీజరూపంలో మానవుడు పుట్టాడు. మహిమలు ఆవిర్భవించినాయి. దేవతలు సృష్టి తరువాతనే అవతరించారు." అని చెప్పబడింది.

ఋగ్వేదంలోని **పదవ మండలంలోని 190వ సూక్తంలో**

ప్రజ్వలిత తపస్సు నుంచి యజ్ఞము, సత్యము ఆవిర్భవించినాయి. ఆ తరువాత రాత్రింబవళ్ళు, జలము, సముద్రము కలిగినాయి. సముద్రము నుంచి సంవత్సరము పుట్టింది. తరువాత రాత్రింబవళ్లు కలిగినాయి. పూర్వకాలాన్ననుసరించే ఈశ్వరుడు సూర్యచంద్రులను, భూమి, అంతరిక్షము, స్వర్గాలను సృష్టించినాడు. అని చెప్పబడింది.

జగదుత్పత్తి గురించి పురుషసూక్తంలో చెప్పబడింది.

# పురుష సూక్తము

ఋగ్వేదంలో **పదవ మండలంలోని తొంభైయవ సూక్తము** పురుష సూక్తము. దీనికి ఋషి నారాయణుడు. దేవత అవ్యక్త పురుషుడు. (కంటికి కనిపించని) పరమేశ్వరుదు. ఈ సూక్తము అనుష్టుప్, త్రిష్టుప్ ఛందస్సులలో ఉంది.

**సహస్రశీర్షా పురుషః సహస్రాక్ష స్సహస్రపాత్ ।**
**స భూమిం విశ్వతో వృత్వా అత్యతిష్ఠ ద్దశాఙ్గులమ్ ॥ 1**

**పురుష ఏవేదగ్ం సర్వం, యద్భూతం యచ్చభవ్యమ్ ।**
**ఉతామృతత్వ స్యేశానః, యదన్నే నా తిరోహతి ॥ 2**

**ఏతావానస్య మహిమా అతో జ్యాయాగ్ంశ్చ పూరుషః ।**
**పాదోఽస్య విశ్వాభూతాని త్రిపాద స్యామృతం దివి ॥ 3**

**త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః పాదోస్యేహా భవాత్పునః ।**
**తతో విష్వ జ్వ్యక్రామత్ సాశనానశనే అభి ॥ 4**

**తస్మా ద్విరాడజాయత విరాజో అధి పూరుషః ।**
**సజాతో అత్యరిచ్యత పశ్చా ద్భూమి మథోపురః ॥ 5**

**యత్పురుషేణ హవిషా దేవా యజ్ఞ మతన్వత ।**
**వసంతో అస్యాసీదాజ్యం గ్రీష్మ ఇధ్మశ్శరద్ధవిః ॥ 6**

**సప్తాస్యాసన్ పరిధయః త్రిస్సప్త సమిధః కృతాః ।**
**దేవా యద్యజ్ఞం తన్వానాః అబధ్నన్ పురుషం పశుమ్ ॥ 7**

**తం యజ్ఞం బర్హిషి ప్రౌక్షన్, పురుషం జాత మగ్రతః ।**
**తేన దేవా అయజన్త సాధ్యా ఋషయశ్చయే ॥ 8**

**తస్మాద్యజ్ఞాత్సర్వ హుతః సంభృతం పృషదాజ్యమ్ ।**
**పశూగ్ం స్తాగ్శ్చక్రే వాయవ్యాన్ ఆరణ్యాన్ గ్రామ్యాశ్చయే ॥ 9**

తస్మాద్యజ్ఞాత్సర్వహుతః ఋచస్సామాని జజ్ఞిరే ।
ఛందాగ్ంసి జజ్ఞిరే తస్మాత్ యజుస్తస్మాదజాయత ॥ 10

తస్మాదశ్వా అజాయన్త యేకేచో భయాదతః ।
గావోహజజ్ఞిరే తస్మాత్ తస్మాజ్జాతా అజావయః ॥ 11

యత్పురుషం వ్యదధుః, కతిధా వ్యకల్పయన్ ।
ముఖం కిమస్య కౌ బాహూ, కావూరూ పాదా వుచ్యేతే ॥ 12

బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్; బాహూరాజన్యః కృతః ।
ఊరూతదస్య యద్వైశ్యః పద్భ్యాగ్ం శూద్రో అజాయత ॥ 13

చంద్రమా మనసో జాతః చక్షో స్సూర్యో అజాయత ।
ముఖాదింద్రశ్చాగ్నిశ్చ ప్రాణాద్వాయురజాయత ॥ 14

నాభ్యా ఆసీదంతరిక్షమ్ శీర్ష్ణోద్యౌస్సమవర్తత ।
పద్భ్యాం భూమిర్దిశ శ్రోత్రాత్ తథా లోకాగ్ం అకల్పయన్॥ 15

వేదాహమేతం పురుషం మహాన్తం ఆదిత్య వర్ణం తమసస్తు పారే ।
సర్వాణి రూపాణి విచిత్య ధీరః నామాని కృత్వా అభివదన్ యదాస్తే ॥16

ధాతా పురస్తాద్య ముదాజహార
శక్రః ప్రవిద్వాన్ ప్రదిశశ్చతస్రః ।
త మేవం విద్వా నమృత ఇహ భవతి
నాన్యః పంథా అయనాయ విద్యతే॥ 17

యజ్ఞేన యజ్ఞ మయజంత దేవాః తాని ధర్మాణి ప్రథమా న్యాసన్ ।
తే హ నాకం మహిమానస్సచన్తే యత్ర పూర్వే సాధ్యాస్సంతి దేవాః ॥ 18

అద్భ్యస్సంభూతః పృథివ్యై రసాచ్చ విశ్వకర్మణ స్సమవర్తతాధి
తస్య త్వష్టా విదధ ద్రూపమేతి తత్పురుషస్య విశ్వమాజాన మగ్రే ॥ 19

వేదాహ మేతం పురుషం మహాంతమ్ ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్ ।
తమేవం విద్వానమృత ఇహ భవతి నాన్యః పంథా విద్యతేయనాయ ॥20

ప్రజాపతిశ్చరతి గర్భే అంతః అజాయమానో బహుధా విజాయతే ।
తస్య ధీరాః పరిజానంతి యోనిమ్ మరిచీనాం పద మిచ్ఛంతి వేధసః॥21

యో దేవేభ్యం ఆతపతి, యో దేవానాం పురోహితః
పూర్వో యో దేవేభ్యో జాతః, నమో రుచాయ బ్రాహ్మయే ।
రుచం బ్రాహ్మం జనయంతః, దేవా అగ్రే తదబ్రువన్
యస్త్వైవం బ్రాహ్మణో విద్యాత్, తస్య దేవా అసన్ వశే ॥ 22

హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ, అహోరాత్రే పార్శ్వే
నక్షత్రాణి రూపమ్, అశ్వినౌ వ్యాత్తమ్
ఇష్టం మనిషాణ, అముం మనిషాణ, సర్వం మనిషాణ ॥ 23

ఓం తచ్ఛం యోరావృణీమహే, గాతుం యజ్ఞాయ
గాతుం యజ్ఞపతయే, దైవీ స్వస్తిరస్తు నః ।
స్వస్తిర్మానుషేభ్యః, ఊర్ధ్వం జిగాతు భేషజమ్
శం నో అస్తు ద్విపదే, శం చతుష్పదే ॥ 24

*ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః*

మన కంటికి కనిపించే ఈ జగత్తంతా ఆ పరమాత్మ యొక్క విశ్వరూపము. ఆ పరమాత్మ ఈ జగత్తులో ఉన్న సమస్త జీవులయందు ఉన్నాడు. జగత్తులోని 84 లక్షల జీవరాశి ఆయన స్వరూపమే. ఈ కారణం చేతనే ఆయన అనేక శిరస్సులు నేత్రములు, పాదములు కలిగి ఉన్నాడు. ఆయన ఈ బ్రహ్మాండమంతటా లోపలా బయటా కూడా వ్యాపించి ఉన్నాడు. ఈ శరీరంలో కేవలము పది అంగుళాలకే పరిమితమైన ఉదరమందున్నాడు. ఆయనే ఈ జగత్తుగా పరిణామము చెందుతున్నాడు. అయినప్పటికీ ఈ అవస్థ ఆయనకు కేవలము కల్పితమే. ఆయన త్రికాలముల యందు ఉంటాడు. ఈ జగత్తును పొందగల శక్తి కన్న ఇంకా ఎక్కువైన శక్తి గలవాడు.

ఆవిరాట్పురుషుడు మొదటగా దేవతలను సృష్టించాడు. తరువాత సృష్టి చేసే సామర్ధ్యం పొందటానికి దేవతలంతా కలసి ఒక యజ్ఞం చెయ్యాలి అనుకొన్నారు. అప్పటికి ఈ సృష్టి పూర్తిగా జరగలేదు. అందుకని ఆ యజ్ఞానికి కావలసిన సమిధలు పూర్తిగా దొరకలేదు. అందుచేత దేవతలు విరాట్పురుషుని స్వరూపాన్నే హవిస్సుగా

భావన చేసి మానసిక యజ్ఞం చేయసాగారు. ఆ యజ్ఞానికి నేయికై వసంత ఋతువును, పురోడాశము (హవిస్సు) కోసం శరదృతువును, మనసులో భావన చేశారు. ఆ యజ్ఞానికి గాయత్రి మొదలై ఛందస్సులు ఏడు మేరలుగా, ఆ ఏడింటితో ఏర్పడిన ఇరువది ఒక్క సమిధలు భావన చేశారు. అంతట వారు ఆ పురుష పశువును యూపస్తంభానికి కట్టేసి యజ్ఞం పూర్తి చేశారు. ఈ రకంగా దేవతలు, సాధ్యులు, ఋషులు కలిసి చేసిన ఆ మానస యజ్ఞము నుండి 'పృషత్' అనే ఆజ్యము వచ్చింది. వాయుదేవతాకములగు పశువులు, గ్రామాలలో ఉండే ఆవులు, వేదాలు, గాయత్రి మొ॥ ఛందస్సులు ఆ యజ్ఞము నుంచి పుట్టినాయి.

ఆ మానస యజ్ఞము నుండి గుర్రాలు, నోటిలో పైన, క్రింద దంతాలుగల గాడిదలు, ఆవులు, మేకలు, గొర్రెలు పుట్టినాయి. దేవతలు విరాడ్రూపుని సంకల్పముతో పుట్టించినప్పుడు అనేక విధాలుగా ఆలోచనలు చేశారు. ఇక ఆయన శరీర భాగాల గురించి చెబుతున్నారు. ఆయన ముఖము నుండి బ్రాహ్మణుడు. బాహువుల నుండి క్షత్రియులు, తొడల నుండి వైశ్యులు, పాదముల నుండి శూద్రులు పుట్టారు. ఆయన మనసు నుంచి చంద్రుడు, నేత్రముల నుంచి సూర్యుడు, ముఖము నుండి ఇంద్రుడు, అగ్ని, ప్రాణముల నుండి వాయువు, నాభి నుంచి అంతరిక్షము ఏర్పడ్డాయి. ఆయన శిరస్సువలన స్వర్గము, పాదముల వల్ల భూమి, చెవుల నుండి దిశలు, ఏర్పడ్డాయి. ఈ రకంగా లోకాలన్నీ సృష్టించబడ్డాయి.

ఋగ్వేదంలో ముద్గలోపనిషత్తు అని ఒక ఉపనిషత్తు ఉన్నది. అందులో పురుష సూక్తము యొక్క అర్థము వివరించబడింది. అయితే పురుషసూక్తంలోని మిగిలిన మంత్రాలనీ ఫలశ్రుతిని తెలియచేస్తున్నాయి. ఇక్కడ ఒక్క నిమిషం ఆగుదాం. చాతుర్వర్ణ్య వ్యవస్థను గురించి మొదటగా చెప్పింది ఈ పురుష సూక్తంలోనే. చాతుర్వర్ణాలు ఆ విరాట్పురుషుని నుంచే ఆవిర్భవించాయి అని.

ఒకసారి ఒక యూనివర్శిటీలో తెలుగు డిపార్ట్‌మెంటులో తెలుగు ఉపాధ్యాయులకు 'రిఫ్రెషర్ కోర్సు' క్లాసులు జరుగుతున్నాయి. ఆ సమయంలో ఒక రోజున ఒక చిన్న కార్యక్రమం ఏర్పాటు చేసి, ఆ కోర్సుకు వచ్చిన లెక్చరర్లు అందరినీ ఏదో ఒక అంశంమీద కొద్దిసేపు అందరూ మాట్లాడండి అన్నారు. కొందరు పద్యాలు చదివారు. కొందరు గేయాలు చదివారు. కొందరు కథలు చెప్పారు. ఈ

రకంగా అందరూ తమ తమ ప్రజ్ఞాపాటవాలు చూపుతున్నారు. ఒకాయన లేచి పురుషసూక్తంలో కొంత భాగం చదివి చాతుర్వర్ణాలు ఈ రకంగా ఏర్పడ్డాయి. పరమేశ్వరుని ముఖం నుండి బ్రాహ్మణుడు, బాహువుల నుండి క్షత్రియుడు, ఊరువుల నుంచి వైశ్యుడు, పాదాల నుంచి శూద్రుడు జన్మించారు. అని చెప్పాడు. అందరూ చప్పట్లు కొట్టారు. మహదానందంగా ఆయన ఇవతలకి వచ్చి తన కుర్చీలో కూచున్నాడు. ఇంతలో ఒక నాస్తికవాది లేచి "వ్రాసే వాడికి లేకపోతే చెప్పేవాడికైనా బుద్ధి ఉండాలి. మానవులు స్త్రీ పురుష సమాగమం వల్లనే పుడతారు. అంతేకాని కాళ్ళనుంచి చేతుల నుంచి పుడతారా ఎక్కడైనా? కొంతమంది తమ ఆధిక్యతని చూపుకోటానికే ఇలాంటి మాటలు చెబుతుంటారు." అంటూ దులిపేశాడు. ఇందాక ఈ విషయాలు మాట్లాడిన పండితుడి ముఖం వెలవెలపోయింది. మిగిలిన వాళ్ళు కూడా ఎవ్వరూ మాట్లాడకుండా అలా ఉండిపోయారు. ఇక్కడ ఈ విషయాన్ని మనం చూద్దాం.

అసలు సృష్టి ఎలా జరుగుతుంది. సృష్టి రెండు రకాలు. బ్రహ్మ చేసినది మానసిక సృష్టి. ప్రజాపతులు చేసినది మైథున సృష్టి. ఇక పోతే సృష్టి నాలుగు రకాలుగా జరుగుతుంది అని ఉపనిషత్తులు చెబుతున్నాయి. దీన్ని మన విజ్ఞానశాస్త్రం కూడా ఒప్పుకుంటోంది.

1. అండజాలు – గ్రుడ్డునుంచి పుట్టినవి. పక్షులు, పాములు మొ॥
2. స్వేదజాలు – చెమట నుంచి, మలిన పదార్ధముల నుంచి పుట్టినవి. క్రిములు, కీటకాలు.
3. ఉద్భిజ్జాలు – నేల నుంచి పుట్టినవి. చెట్లు, వృక్షాలు
4. జరాయుజాలు – స్త్రీ జననేంద్రియము నుంచి పుట్టినవి. మనుషులు, పశువులు మొ॥

ఈ రకంగా సృష్టి జరుగుతుంది. బ్రాహ్మణుడు బ్రహ్మముఖం నుంచి పుట్టాడు. బ్రాహ్మణుడు అంటే బ్రహ్మతేజస్సుతో ప్రకాశించేవాడు. అంటే ఆ పరమేశ్వరుని ముఖం దివ్యమైన తేజస్సుతో ప్రకాశిస్తున్నది. సృష్టిలో మొదట అందరూ బ్రాహ్మణులే. జనాభా పెరిగే కొద్దీ వారికి రక్షణ కావలసి వచ్చింది. అందుకనే పరమేశ్వరుడు బలవంతులైన పరాక్రమవంతులైన క్షత్రియులను సృష్టించాడు. ఇంకొంత కాలం

పోయే సరికి ప్రజల మనుగడకు ధనం అవసరమైంది. దానికోసం రహస్యాలు దాచగల వైశ్యుణ్ణి సృష్టించాడు. ఇతడు ఆ రహస్యాలకు సంకేతంగా ఊరు ప్రదేశం నుంచి ఆవిర్భవించాడు. ఆ తరువాత వీరందరికీ సేవలు చెయ్యటానికి శూద్రుణ్ణి సృష్టించాడు. వీరందరూ ఎక్కడ నుంచి పుట్టినా విరాట్పురుషునిలో భాగాలే. మన శరీరంలో ఏ అంగమూ ఎక్కువ కాదు ఏదీ తక్కువా కాదు. ఒకవేళ పాదాలు పనికి రానివి అనుకుంటే వాటిని నరికెయ్యండి. చాతుర్వర్ణాలలో అన్ని వర్ణాలు సమానమే. అందరూ విరాట్పురుషునిలో భాగాలే. ఇక పంచముల గురించి ఎక్కడా చెప్పలేదు కదా? ఇది ప్రశ్న. ఈ పంచములనే 'నిషాదులు' అన్నాడు సాయణుడు. ఈ రకంగా పరమేశ్వర స్వరూపం నుంచే సృష్టి జరిగింది అని చెబుతోంది పురుషసూక్తం.

వర్ణవ్యవస్థని గురించి చెప్పేటప్పుడు **చాతుర్వర్ణం మయాసృష్టం గుణకర్మ విభాగచ** అన్నాడు భగవానుడు గీతలో. అంటే మానవులు చేసే వృత్తులను బట్టి ఈ వర్ణవ్యవస్థ ఏర్పాటు చేయబడిందన్న మాట. ఆ రోజుల్లో ఒక వర్ణంలోని వారు ఇంకో వర్ణంలోకి మారటం కూడా జరిగేది. క్షత్రియుడైన విశ్వామిత్రుడు బ్రాహ్మణుడైనాడు. అలాగే బ్రాహ్మణుడైన రావణుడు క్షత్రియుడైనాడు. వర్ణాంతర వివాహాలు కూడా జరిగినాయి. అయితే అవి కేవలము అనులోమంగానే జరిగాయి. సృష్టిని గురించి **నాసదీయ సూక్తం**లో కూడా చెప్పబడింది.

## నాసదీయ సూక్తము

ఋగ్వేదము-**10 మండలము - 129 సూక్తము** ఇందులో మొత్తం ఏడు మంత్రాలున్నాయి.

**నాసదాసీన్నో ఉ సదాసీత్ తదానీం నాసీద్రజో నో వ్యోమా పరో యత్ ।**
**కిమావరీవః కుహ కస్య శర్మ న్నంభః కిమాసీ ద్గహనం గభీరమ్ ॥ 1**

**న మృత్యురాసీదమృతం న తర్హి న రాత్ర్యా అహ్న ఆసీత్ ప్రకేతః ।**
**ఆనీదవాతం స్వధయా తదేకం తస్మాద్ధాన్యన్న పరః కిం చనాస ॥ 2**

**తమ ఆసీత్ తమసా గూళ్హమగ్రే ప్రకేతం సలిలం సర్వమా ఇదమ్ ।**
**తుచ్ఛ్యే నాభ్వపిహితం యదాసీత్ తపసస్తన్మహినా జాయతైకమ్ ॥ 3**

కామస్తదగ్రే సమవర్తతాధి మనసో రేతః ప్రథమం యదాసీత్ ।
సతో బంధుమసతి నిరవిందన్ హృది ప్రతీష్యా కవయో మనీషా॥ 4

తిరశ్చీనో వితతో రశ్మిరేషా మధః స్విదాసీ3దుపరి స్విదాసీత్ ।
రేతోధా ఆసన్ మహిమాన ఆసన్ త్స్వధా అవస్తాత్ ప్రయతిః పరస్తాత్॥5

కో అద్ధా వేద క ఇహ ప్ర వోచత్ కుత ఆజాతా కుత ఇయం విసృష్టిః ।
అర్వాగ్దేవా అస్య విసర్జనే నా౽థా కో వేద యత ఆబభూవ ॥ 6

ఇయం విసృష్టిర్యత ఆబభూవ యది వా దధే యది వా న
యో అస్యాధ్యక్షః పరమే వ్యోమన్ త్సో అంగ వేద యది వా న వేద ॥7

## సూక్తార్థం

ప్రళయం జరిగినప్పుడు సత్తులేదు. అసత్తు, భూమి లేదు. ఆకాశం లేదు. ఏమీలేదు. అంతా జలమయంగా ఉంది. ఆ సమయంలో మృత్యువు లేదు. దైవత్వం లేదు. రాత్రిలేదు. పగలులేదు. అప్పుడున్నది పరమేశ్వరుడు ఒక్కడే. అతడు తప్ప ఎవరూ లేరు ఏదీ లేదు. సృష్టి ప్రారంభానికి ముందు అంతా చీకటి గాడాంధకారంగా ఉండేది. అంతా జలమయం. అప్పుడు తపః ప్రభావంతో ఏకమ్ ఒక్కటే వచ్చింది.

మొదటగా మనసులో కోరిక పుట్టింది. ఆ కోరిక నుంచి బీజము వచ్చింది. అవ్యక్తము నుంచి వ్యక్తము ఆవిర్భవించింది. బీజరూపంలో మానవుడు ఆవిర్భవించాడు. మహిమలు ఆవిర్భవించాయి. మానవుల కార్యకలాపాలు విస్తరించినాయి. అన్నం క్రింద, భోక్త పైన ఉన్నారు. జీవి ఆహారం తింటున్నది. ప్రకృతితత్త్వాన్ని తెలిసినవారెవరూ లేరు. దాని గురించి వివరించగలిగిన వారు అంతకన్నా లేరు. అసలు ఏ కారణం చేత ఈ సృష్టి మొదలయిందో తెలియదు. దేవతల కోసం సృష్టి జరిగిందా అంటే కాదు. ఎందుకంటే దేవతలు కూడా మానవుల తరువాతనే అవతరించారు. సృష్టి ఎప్పుడు, ఎక్కడ, ఎలా మొదలైంది ఎవరికీ తెలియదు. విభిన్నమైన ఈ సృష్టి ఎక్కడ నుంచి జరిగింది? ఏ కారణంతో జరిగింది? సృష్టి చేసింది ఎవరు? ఈ విషయాలన్నీ ఆ పరమాత్ముడికే తెలియాలి.

అంతా అనిశ్చితంగా ఉంది. అనిశ్చితమైంది నిశ్చితము ఎలా అవుతుంది? అనిశ్చితము అనిశ్చితమే. ఇదే సత్యము అని చెబుతోంది ఈ సూక్తం. సృష్టిని గురించి ఈ సూక్తంలో చెప్పిన విషయాలు పాశ్చాత్యులుకూడా అంగీకరించారు.

# 8. ఉపనిషత్తులు-జగత్సృష్టి

జగత్తులో సృష్టి ఎలా జరిగింది ? అనే విషయం మీద భిన్నమైన వాదనలు ఉన్నాయి. వివిధ రకాల ఉపనిషత్తులలో కూడా ఈ విషయాలే చెప్పబడ్డాయి. మనకు ఉన్నటువంటి దేవతలలో ప్రధానమైనవారు ఐదుగురు 1. ఆదిత్యుడు 2. అంబిక 3. గణపతి 4. విష్ణువు 5. శివుడు. వీరినే పంచాయతనము అంటారు. వీరిలో ఏ దేవతను ఆరాధించేవారు ఆ దేవతనే పరమేశ్వర స్వరూపంగా అభివర్ణించారు. ఆ దేవతయే సృష్టికి మూలకారణము అన్నారు. ఉదాహరణకు **నారాయణోపనిషత్తు**ను చూద్దాం. వైష్ణవులకు ఇది ప్రధానమైన ఉపనిషత్తు. వారి అధిదేవత శ్రీమన్నారాయణుడు లేదా శ్రీమహావిష్ణువు. నారాయణోపనిషత్తులో "సృష్టి ప్రారంభంలో ఉన్నవాడు పరమపురుషుడైన నారాయణుడొక్కడే. అతడు సృష్టిచెయ్యాలి అనుకున్నాడు. అప్పుడు శ్రీమన్నారాయణుని శరీరంనుంచి సూక్ష్మరూపి అయిన హిరణ్యగర్భుడు ఉదయించాడు. ఆ తరువాత తన్మాత్రలు, పంచభూతాలు పుట్టినాయి. ఈ రకంగా నారాయణుని శరీరంనుంచి బ్రహ్మ, రుద్రుడు, ఇంద్రుడు, మరీచి, కశ్యపుడు ఇతర ప్రజాపతులు, అష్టవసువులు, ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు, సకల వేదాలు ఆవిర్భవించినాయి. చరాచర జగత్తంతా శ్రీమన్నారాయణుని నుంచే ఆవిర్భవించింది. ఇవన్నీ నారాయణునిలోనే ఉన్నాయి. చివరకు నారాయణుని యందే లయమవుతున్నాయి. నారాయణుడే సత్యము నిత్యము అయినవాడు. నారాయణుడే బ్రహ్మ. నారాయణుడే శివుడు. అతడే ఇంద్రుడు, భూమి, ఆకాశము, కాలము, దశ దిశలు అంతా నారాయణుడే. పైభాగాన ఉన్నది, క్రింది భాగాన ఉన్నది, మధ్యభాగాన ఉన్నదీ నారాయణుడే. బాహ్యాభ్యంతరముల యందంతటా నారాయణుడే. భూత భవిష్యద్వర్తమానాలు నారాయణుడే." అని చెప్పబడింది. అంటే చరాచర జగత్తంతా శ్రీమన్నారాయణునుంచే ఆవిర్భవించింది. ఇవన్నీ నారాయణునిలోనే ఉన్నాయి. చివరకు నారాయణుని యందే లయమవుతున్నాయి. నారాయణుడే సత్యము నిత్యము అయినవాడు. నారాయణుడే బ్రహ్మ. నారాయణుడే శివుడు. అతడే ఇంద్రుడు, భూమి, ఆకాశము, కాలము, దశ దిశలు అంతా నారాయణుడే. పైభాగాన ఉన్నది, క్రింది భాగాన ఉన్నది, మధ్యభాగాన ఉన్నదీ నారాయణుడే. బాహ్యాభ్యంతరముల

యందంతటా నారాయణుడే. భూత భవిష్యద్వర్తమానాలు నారాయణుడే.” అని చెప్పబడింది. అంటే చరాచర జగత్తంతా శ్రీమన్నారాయణునుంచే ఆవిర్భవించింది. ఈ జగత్తు అంతా నారాయణ స్వరూపమే.

అయితే వైష్ణవంలో సృష్టివిధానం ఈ రకంగా కూడా చెప్పబడింది. జగత్తుయొక్క సృష్టి స్థితి లయాలను చూసేది శ్రీమన్నారాయణుడు. ఈయన ఇరవై ఐదు తత్త్వములు గల పురుషుడని వేదాలు కీర్తిస్తున్నాయి. ఇతడు ఆద్యంతములు లేని పురుషోత్తముడు ఈయన కనులు తెరిస్తే పగలు అదే సృష్టి. కనులు మూస్తే రాత్రి (ప్రళయము) ఇదే కల్పము. ఈయన అనంతుడు. ఈయనకు రూపంలేదు. కాళ్ళు చేతులు మొదలైన అంగాలు లేవు. శరీరం లేదు. ఆయన సర్వాన్నీ ఆవరించి ఉన్నాడు. అన్ని ఇంద్రియాల గుణాలను ప్రకాశింపచేస్తున్నాడు. ఇతడే ముక్తి ప్రదాత. అతనివల్లనే సర్వము సంభవిస్తున్నది. ఆ పురుషుని నుండే హిరణ్యగర్భుడు జన్మించాడు. దానినుండి ఆకాశము, వాయువు, తేజస్సు, జలము ఆవిర్భవించినాయి. జలము నుండి ఒక అండము పుట్టింది. అది హిరణ్మయము. ఈ హిరణ్మయమైన అండమే ప్రజాపతి అని వేదాలు చెబుతున్నాయి. పరమేశ్వరుడు ఈ అండాన్ని రెండు భాగాలుగా చేశాడు. ఇందులో పైభాగము ఆకాశము కాగా క్రింది భాగము రసాతలము. ఈ అండము నుంచి వచ్చిన మావిజలమునందు పడి భూమి ఏర్పడింది. ఆ భూమిమీద అనేకవేల యోజనాల విస్తీర్ణముగల పర్వతాలు, కొండలు, పెద్దపెద్ద చెట్లు అన్నీ ఉన్నాయి. ఆ బరువును మోయలేక భూమినీటిలో మునిగిపోయింది. అలా మునిగిపోతూ తనను రక్షించమని శ్రీహరిని ప్రార్థించింది. అప్పుడు శ్రీహరి ఆదివరాహమై తన కోరలమీద మోసి ఈ భూమిని రక్షించాడు. ఈ రకంగా శ్రీమహావిష్ణువు వల్లనే ఈ సృష్టి జరిగింది. అని చెప్పబడింది.

త్రిమూర్తులలో మూడవవాడైన రుద్రుని పరమేశ్వర స్వరూపంగా (ఇతడే శివుడు) ఆరాధించేవారికి ముఖ్యమైనది **అథర్వశిఖోపనిషత్తు** అందులో దేవతలంతా రుద్రుడు నివసించే స్వర్గలోకానికి వెళ్ళి “దేవా ! నీవెవరవు ?” అని అడుగుతారు. దానికి రుద్రుడు “ఈ సృష్టికి ముందు నేను ఒక్కడనే ఉన్నాను. ఇప్పుడున్నాను భవిష్యత్తులోనూ ఉంటాను. నాకన్న వేరైనవారు లేరు. త్రికాలాతీతుడను, నిత్యానిత్యుడను నేనే, బ్రహ్మమును నేనే, చక్షురాది ఇంద్రియాలు నేనే. శ్రోత్రాది ఇంద్రియాలు నేనే. ఊర్ధ్వదిక్కు, అథోదిక్కు, దశదిశలు, విదిశలు నేనే. స్త్రీ, పురుషుడు, నపుంసకుడు

నేనే. గాయత్రి నేనే, సావిత్రినేనే, త్రిష్టుప్, జగతీ, అనుష్టుప్ మొదలైన ఛందస్సులు నేనే. గార్హపత్యాగ్ని, దక్షిణాగ్ని, ఆహవనీయాగ్ని నేనే. గోవు నేనే, గౌరీదేవి నేనే, జ్యేష్ఠుడను, శ్రేష్ఠుడను కూడా నేనే. అధికుడను నేనే. జలమునేనే, తేజస్సు నేనే, చతుర్వేదాలు నేనే. ఓంకారము నేనే. పుష్కరము నేనే. పవిత్రము నేనే, అగ్రభాగము, మధ్యభాగము, అథోభాగము నేనే, దశదిశలలో ఉన్నది, లేనిది కూడా నేనే. జ్యోతిరూపుడను నేనే. నేను జగత్తంతా ఆవరించి ఉన్నాను. నేను సర్వవ్యాపిని, సర్వరూపిని చరాచర జగత్తంతా నాచేతనే సృష్టించబడింది." అంటాడు.

శాక్తేయులంతా ఆ పరమేశ్వరిని ఆరాధిస్తారు. పరమేశ్వరిని గురించి వివరించేవి ఎనిమిది ఉపనిషత్తులున్నాయి. అందులో **బహ్వృచోపనిషత్తు** ఒకటి. దానిలో ఈ సృష్టి ప్రారంభానికి ముందు ఆ పరమేశ్వరి ఒక్కతేఉండేది. ఆమెయే ఈ జగత్తును సృష్టించింది. ఆమెయే కామకళ శృంగారకళ. ఆమెనుండి ముందుగా బ్రహ్మ ఉద్భవించాడు. ఆ తరువాత విష్ణువు, రుద్రుడు, మరుద్గణాలు, గంధర్వులు, అప్సరసలు, కిన్నరలు, భోగ్యము ఈ రకంగా అన్నీ ఉద్భవించినాయి. అండజాలు, స్వేదజాలు, ఉద్భిజ్జాలు, స్థావరములు, జంగమములు, పశువులు, పక్షులు, జంతువులు, మృగాలు, జలచరాలు, చెట్లు, చేమలు చివరకు మానవులు పుట్టారు. ఆమెయే పరాశక్తి. శాంభవి. కాదివిద్య, హాదివిద్య, ఆమెయే త్రిపురసుందరి అని చెప్పబడింది.

శాక్తేయంలో ఇంకొక విషయంకూడా ఉన్నది. నిరాకారుడు నిర్గుణ స్వరూపుడు పరబ్రహ్మ. ఇతడు బిందు రూపంలో ఉన్నాడు. ప్రళయం జరిగినప్పుడు కర్మక్షయం అయిన జీవులు ముక్తిని పొందుతాయి. కర్మక్షయం కాని జీవులు తమ తమ కర్మలను తమతో మూటకట్టుకుని మాయలో కలిసిపోతాయి. ఆ మాయ వచ్చి పరమేశ్వరునిలో చేరుతుంది. ఇప్పుడు కర్మక్షయం కాకుండా తనలో ఇమిడిఉన్న జీవరాశికి మోక్షం కలిగించాలనే ఉద్దేశ్యంతో ఆ పరమేశ్వరుడు సృష్టి చెయ్యాలని సంకల్పించాడు. ఆ స్థితిలో అతని నుంచి కొంత శక్తి బయటకు వచ్చింది. అదే శక్తి. ఈ శక్తికీ శివుడికీ భేదంలేదు. రెండూ ఒకటే. ఈ శక్తి త్రికోణాకారంలో ఉన్నది. ఇదే మాయ. అవ్యక్తము. దీనినుంచి మహత్తత్త్వము, అహంకారము తన్మాత్రలు, వాటినుంచి పంచభూతాలు పుట్టినాయి. ఈ పంచభూతాలు, తన్మాత్రలు పంచీకరణం చెందటంవల్ల పదిహేను భాగాలుగా అయినాయి. వీటినుంచే జీవరాశి ఆవిర్భవించింది. ఇది రూపాత్మకమైన

జగత్తు. ఇక నామాత్మకమైన జగత్తును చూద్దాం. ముందుగా ఓంకారము పుట్టింది. దానినుంచి అకార ఉకార, మకారాలు పుట్టాయి. వాటినుంచి అక్షర సమామ్నాయము వచ్చింది. దానినుంచి పదాలు, మాటలు, వాక్యాలు, మంత్రాలు, వేదాలు, శాస్త్రాలు, సంగీతము, సాహిత్యము అన్నీ ఆవిర్భవించాయి. ఈ రకంగా నామరూపాత్మకమైన జగత్తు ఏర్పడింది. **'లలితారహస్యోపనిషత్తు'**లో సృష్టి అంతా ఆమెచేతనే చేయబడింది. అని చెప్పటం జరిగింది.

ఇలాకాదు. గుణత్రయ విభాగం చేత సృష్టి ఏర్పడింది. అని కొందరివాదన. గుణాలు మూడు. అవి సత్త్వగుణము, రజోగుణము, తమోగుణము. సృష్టి మూడు రకాలుగా జరిగింది. 1. ఏకగుణ సృష్టి 2. ద్విగుణసృష్టి 3. త్రిగుణసృష్టి

**1. ఏకగుణసృష్టి :** ఇందులో ఒకే గుణముంటుంది.

సత్త్వగుణంవల్ల – బ్రహ్మాదిదేవతలు

రజోగుణంవల్ల – మానవులు, మృగాలు, పశుపక్ష్యాదులు, జలచరాలు

తమోగుణంవల్ల – చెట్లు, చేమలు, పర్వతాలు

మొదలైనవి ఆవిర్భవించాయి. ఇది ఏకగుణసృష్టి.

**2. ద్విగుణసృష్టి :** ఇందులో ప్రతిగుణము మళ్ళీ మూడుభాగాలు అవుతుంది. దానినుంచి ప్రాణికోటి ఆవిర్భవించింది.

1. సత్త్వసత్త్వము నుంచి – విరాట్పురుషాదులు
2. సత్త్వరజమునుంచి – దేవపురుషులు, వాలఖిల్యులు, వైఖానసులు
3. సత్త్వతమస్సు నుంచి – యక్షులు, రాక్షసులు, విద్యాధరులు
4. రజస్సత్త్వము – మానవులు
5. రజోరజము – పశువులు మృగాలు
6. రజస్తమము – స్వేదజాలు, అండజాలు, జలచరాలు
7. తమఃసత్త్వము – పైరులు, గడ్డిపంటలు మొ॥
8. తమోరజస్సు – చెట్లు, పొదలు, తీగెలు
9. తమస్తమము – భూములు, కొండలు, బండలు

**త్రిగుణసృష్టి:** ఇందులో ప్రతిగుణంలోనూ మూడు భాగాలుంటాయి అవి మళ్ళీ ఒక్కొక్కటి మూడు భాగాలవుతాయి. ఈ రకంగా మొత్తం 27 భాగాలవుతాయి. వీటివల్లనే ఈ జగత్తంతా సృష్టించబడింది.

1. సత్త్వంలో తమస్తమము – శేషుడు, వాసుకి మొ॥వారు
2. సత్త్వంలో తమోరజము – దేవతలు, అంగిరసుడు మొ॥వారు
3. సత్త్వంలో తమఃసత్త్వము – కర్మదేవతలు, నవగ్రహాలు
4. సత్త్వంలో రజస్తమము – సిద్ధులు, సాధ్యులు
5. సత్త్వంలో రజోరజము – సప్తఋషులు, శుకవామదేవాదులు
6. సత్త్వంలో రజఃసత్త్వము – దిక్పాలకులు, పంచబ్రహ్మలు
7. సత్త్వంలో సత్త్వతమస్సు – విరాట్టు, హిరణ్యగర్భుడు
8. సత్త్వంలో సత్త్వరజస్సు – సూత్రాత్మ, నిర్వికల్ప సమాధి నిష్ఠులు
9. సత్త్వంలో సత్త్వసత్త్వము – సర్వజ్ఞత్వము, సర్వేశ్వరత్వము, సర్వాంతర్యామిత్వము
10. రజంలో తమస్తమము – కందిరీగలు, తేళ్ళు, పాములు, చీమలు
11. రజంలో తమోరజము – మొసళ్ళు, పీతలు, నత్తలు
12. రజంలో తమఃసత్త్వము – కాకులు, పిచ్చుకలు, చిలకలు, గోరువంకలు
13. రజంలో రజస్తమము – సింహాలు, పులులు, ఎలుగుబంట్లు
14. రజంలో రజోరజము – ఏనుగులు, గుర్రాలు, కోతులు, మేకలు
15. రజంలో రజఃసత్త్వము – కర్రిఆవులు, చమరీమృగాలు, జింకలు, దుప్పులు
16. రజంలో సత్త్వతమము – శూద్రులు, మంగలి, మాల, చాకిలి
17. రజంలో సత్త్వరజము – పుణ్యకర్మలు, దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేసే పాలకులు
18. రజంలో సత్త్వసత్త్వము – బ్రహ్మవాదులు, వేదవిదులు, దశవిధ బ్రాహ్మణులు ★
19. తమంలో తమస్తము – కొండలు, బండలు, ముళ్ళచెట్లు నిర్జన ప్రదేశాలు, చవిటినేలలు

20. తమంలో తమోరజము - మంచి పంటలు పండే నేలలు, తపస్సు యజ్ఞము చేసే ప్రాంతాలు, దేవబ్రాహ్మణ నివాసాలు

21. తమంలో తమఃసత్త్వము - పుణ్యక్షేత్రాలు, పుణ్యనదులు

22. తమంలో రజస్తమము - ముష్టి, వేము, బలురక్కసి, నాగజెముడు, తాడి, ఈత

23. తమంలో రజోరజము - నిమ్మ, దానిమ్మ, బత్తాయి, మర్రి, జమ్మి

24. తమంలో రజఃసత్త్వము - అరటి, పనస, మామిడి, వెలగ, పద్మ, కలువ, పారిజాతాదులు

25. తమంలో సత్త్వతమము - ఉలవ, జొన్న, అరిగ ధాన్యాలు

26. తమంలో సత్త్వరజము - కంది, మినుము, నువ్వు, నల్లవరి

27. తమంలో సత్త్వసత్త్వము - తెల్లవరి, సన్నవరి, చెరకు, పెసర

★ దశవిధ బ్రాహ్మణులు అంటే - వేదవిద్యా సంపన్నులు, ఆచారవంతులు అయిన 1. ఆంధ్ర, 2. కర్నాటక, 3. ద్రావిడ, 4. ఘూర్జర, 5. మహారాష్ట్రులు వీరు పంచ ద్రావిడులు. 1. ఉత్కల, 2. మైథిల, 3. గౌడ, 4. కన్యాకుబ్జ, 5. సారస్వతులు. వీరు పంచగౌడులు. వీరందరూ కలిసి దశవిధ బ్రాహ్మణులు.

ఈ విధంగా గుణత్రయ విభాగంచేత సృష్టి జరుగుతున్నది.

**బృహదారణ్యకోపనిషత్తు**లో సృష్టిని గురించి చెబుతూ

ఈ సృష్టికి పూర్వం మానవాకారంలో ఉన్న విరాడాత్మ మాత్రమే ఉండేది. అతనికన్న భిన్నమైనదేదీ లేదు. సర్వాత్మ భావంతో తనను మాత్రమే చూసుకుని అంతటా నేనే అనుకున్నాడు.

పురుషాకారంలో ఉన్న ప్రజాపతి తాను ఒక్కడే అయి ఉండి కూడా భయభ్రాంతుడైనాడు. ఒంటరిగా ఉన్న ప్రజాపతి ఒంటరితనంలోని ఆనందాన్ని అనుభవించలేక స్త్రీని కోరాడు. అలా కోరిన వెంటనే సౌందర్యవతి అయిన స్త్రీ ప్రత్యక్షమైంది. అంటే తన శరీరంలోని కొంతభాగం నుంచే స్త్రీని సృష్టించాడన్నమాట.

ఆ భాగాలే పతి పత్ని. అందుచేతనే లౌకిక శరీరం ధాన్యపుగింజలోని బద్దలాంటిది. రెండు దళాలు లేదా బద్దలు స్త్రీ పురుషులకు ప్రతిరూపాలు.

ప్రజాపతివల్ల కలిగిన స్త్రీ పేరు శతరూప. అనగా అనేకరూపాలు గలది అని అర్థం. ఆ ప్రజాపతే స్వాయంభువమనువు. కుమార్తెలతో రమించటం నిషేధం కదా. మరి తననుండి పుట్టిన నాతో ఏ విధంగా రమిస్తాడు. అని ఆలోచించి శతరూప ఆవుగా మారిపోయింది. పురుషుడు ఆ బోతు అయినాడు. గోసంతతి వృద్ధి చెందింది. శతరూప ఆడుగుర్రము అయింది. పురుషుడు మగగుర్రం అయినాడు. అశ్వసంతతి పెరిగింది. శతరూప ఆడుగాడిద అయ్యింది. పురుషుడు మగగాడిద అయినాడు. గార్ధభ సంతతి వర్ధిల్లింది. ఈ రకంగా ఆ స్త్రీ 84 లక్షల రూపాలు ధరించింది. పురుషుడు కూడా అన్ని రూపాలు ధరించాడు. జగత్తులో 84 లక్షల రకాలయిన జీవరాశి వృద్ధి చెందింది. అందుచేతనే సృష్టి అనేది ప్రజాపతికి మారుపేరయింది.

సృష్టిని గురించిన మరొక విషయం కూడా బాగా ప్రచారంలో ఉంది. సృష్టి చెయ్యటం కోసం బ్రహ్మ కొంతమందిని సృష్టించాడు. వారినే బ్రహ్మ మానసపుత్రులు అంటారు. వారిలో బ్రహ్మయొక్క కుడిచేతి బ్రొటనవేలు నుంచి పుట్టినవాడు దక్షుడు. ఎడమచేతి బ్రొటనవ్రేలు నుంచి పుట్టినది, వీరిణి అనే కన్య. దక్ష ప్రజాపతి వీరిణిని వివాహం చేసుకున్నాడు. వీరికి యాభైమంది కుమార్తెలు కలిగారు. వారిలో అదితి, దితి, దనువు, కాల, అనాయువు, సింహిక, క్రోధ, పృథ, విశ్వ, వినత, కద్రువ, కపిల అనే పన్నెండు మందిని మరీచి కుమారుడైన కశ్యపుడు వివాహం చేసుకున్నాడు. వీరిలో అదితివల్ల దేవతలు, దితివల్ల దైత్యులు, దనువు వల్ల దానవులు, వినతవల్ల పక్షులు, కద్రువ వల్ల పాములు. ఈ రకంగా వివిధ రకాల జీవరాసి ఆవిర్భవించింది.

**సుబాలోపనిషత్తు**లో సృష్టికి పూర్వం ఈ జగత్తంతా పరమేశ్వరమయంగా ఉండేది. ఆ పరమేశ్వరుని నుంచి ముందుగా తమస్సు పుట్టింది. తమస్సు నుండి తన్మాత్రలు, వాటినుండి పంచభూతాలు పుట్టినాయి. అది ఒకగ్రుడ్డుగా అయింది. పన్నెండు నెలల తరువాత పరమేశ్వరుడు ఆ గ్రుడ్డును రెండుగా చేశాడు. దానిలోని

క్రింది భాగము భూమి, పైభాగము ఆకాశము అయింది. మధ్యభాగంలో దివ్యపురుషుడు, సహస్రశీర్షుడు, వేయికనులు, వేయిపాదాలు, వేయిచేతులు, గలవాడున్నాడు అతడే బ్రహ్మ. అతడు ముందుగా మృత్యువును సృష్టించాడు. అది మూడు అక్షరములు, మూడు శిరస్సులు గలది. ఆ తరువాత అతడు ఏడుగురు మానస పుత్రులను సృష్టించాడు. వీరు విరాట్టులు. ఏడుగురు ప్రజాపతులను సృష్టించాడు. ఆ పరమ పురుషుడైన బ్రహ్మ ముఖము నుండి బ్రాహ్మణులు, బాహువుల నుంచి క్షత్రియులు, ఊరువుల నుంచి వైశ్యులు, పాదముల నుంచి శూద్రులు, మనసు నుంచి చంద్రుడు, కనుల నుంచి సూర్యుడు, చెవుల నుంచి వాయువు, హృదయము నుండి సర్వజగత్తు పుట్టినాయి.

అపానము నుండి నిషాదులు, ఎముకల నుండి యక్షులు, రాక్షసులు, గంధర్వులు, రోమముల నుండి – పర్వతాలు, లలాటమునుండి – ఓషధులు, వనస్పతులు, క్రోధము నుండి – రుద్రుడు పుట్టారు. ఈ మహాభూతముయొక్క నిట్టూర్పునుండి – నాలుగు వేదాలు, శిక్ష, కల్పము, వ్యాకరణము, జ్యోతిషము, నిరుక్తము, ఛందస్సు, తర్కము, మీమాంస, ధర్మసూత్రాలు, వ్యాఖ్యానాలు, ఉపవ్యాఖ్యానాలు, సర్వభూతములు వచ్చినాయి. అని చెప్పబడింది.

**మహోపనిషత్తు**లో ఆ పరమ పురుషుని నుండి 14 మంది పురుషులు, ఒక కన్య జన్మించారు. తరువాత జ్ఞానేంద్రియాలు 5, కర్మేంద్రియాలు 5. మనస్సు. మొత్తం పదకొండు ఇంద్రియాలు ఆవిర్భవించాయి. 12. అహంకారము, 13. ప్రాణము, 14. దేహము, 15. బుద్ధి 16. తన్మాత్రలు ఐదు. పంచభూతాలు ఐదు. ఉద్భవించినాయి. ఈ రకంగా 25 తత్త్వములతో నిండిన విరాట్ పురుషుడు జన్మించాడు. ఈ సృష్టిలో పరమాత్మ అధిష్ఠాన రూపంలో ప్రవేశించాడు. 25 తత్త్వాలతో ఉన్న ఆ విరాట్పురుషుని నుండి ప్రధాన సంవత్సరాలు కాలస్వరూపంలో పుట్టినాయి. ఆ తరువాత పరమపురుషుడు ఇంకొక సంకల్పముతో హృదయంలో ద్యానంచేశాడు. ధ్యానంలో ఉన్న అతని లలాటము నుంచి త్రినేత్రుడు, త్రిశూలపాణి అయిన పురుషుడు జన్మించాడు. తేజోవంతుడైన ఆ పురుషుని యందు యశస్సు, సత్యము, బ్రహ్మచర్యము, తపస్సు, వైరాగ్యము, మనస్సు, ఐశ్వర్యము, ప్రణవసహిత

వ్యాహృతులు, చతుర్వేదాలు, సకల ఛందస్సులు ఇవన్నీ ప్రకాశిస్తున్నాయి. అందుచేత ఇతడు ఈశానుడు, మహాదేవుడు అనబడ్డాడు.

తరువాత మరి ఒక సంకల్పంతో పరమపురుషుడు మళ్ళీ ధ్యానం చేశాడు. ధ్యానంలో ఉన్న అతని లలాటము నుంచి స్వేదము పుట్టిది. ఆ స్వేదమే సర్వత్రా వ్యాపించి జలమయింది. ఈ ఉదకము నుండి బంగారుకాంతి గల అండము ఒకటి పుట్టింది. దానినుండి చతుర్ముఖబ్రహ్మ పుట్టాడు. ఈ బ్రహ్మ తూర్పు దిక్కుకు తిరిగి ధ్యానం చేశాడు. అప్పుడు భూః అనే వ్యాహృతి, గాయత్రీ ఛందస్సు, ఋగ్వేదము, అగ్నిదేవత ఆవిర్భవించాయి. బ్రహ్మ పశ్చిమ దిక్కుగా తిరిగి ధ్యానం చేశాడు. అప్పుడు భువః అనే వ్యాహృతి, త్రిష్టుప్ ఛందస్సు, యజుర్వేదము, వాయుదేవత ఆవిర్భవించాయి. తరువాత బ్రహ్మ ఉత్తర దిక్కుగా తిరిగి ధ్యానం చేశాడు. అప్పుడు సువః అనే వ్యాహృతి, జగతీ ఛందస్సు, సామవేదము, సూర్యుడు ఆవిర్భవించారు. తరువాత బ్రహ్మ దక్షిణ దిక్కుగా తిరిగి ధ్యానం చేశాడు. అప్పుడు మహః అనే వ్యాహృతి, అనుష్టుప్ ఛందస్సు, అథర్వణవేదము, సోమదేవత ప్రభవించినాయి. ఆ తరువాత బ్రహ్మ మళ్ళీ మళ్ళీ ధ్యానం చేసి క్షీరసాగర మధ్యంలో ఒక దేవుని దర్శించాడు. ఆ దేవత వేయితలలతోను, వేలకనులతోను ప్రకాశిస్తున్నాడు. విశ్వకళ్యాణ కారకమై, విశ్వాతీతమై, నిత్యమై విలసిల్లుతున్నాడు. అతడు సర్వరూపి. సర్వవ్యాపి. అతడే పరమేశ్వరుడు. నారములయందుంటాడు కాబట్టి శ్రీమన్నారాయణుడు. ఈ చరాచర జగత్తూ అతనినుండే ఆవిర్భవించింది. ఈ జగత్తుకు ఆధారమైనవాడు అతడే.

**ఐతరేయోపనిషత్తు**లో సృష్టిని గురించి వివరించటం జరిగింది. సృష్టికి పూర్వం జగత్తంతా బ్రహ్మమయంగానే ఉండేది. దానికి భిన్నమైన పదార్థం ఏదీలేదు. దాన్నే ఆత్మ అంటారు. ఈ ఆత్మలోకాలను సృష్టించాలనుకొన్నది. మరీచి, ఆపః, మర అనే పేర్లు గల లోకాలను సృష్టించింది. ద్యులోకానికి ఆవల ఉన్నది అంభస్సు. దానికి ఆశ్రయము స్వర్గము. అదే సువర్లోకము. దానిక్రింద భువర్లోకము. దాని క్రింద భూలోకము ఉన్నాయి. ఈ భూలోకము మరణము గుణముగా గలది. ఇక్కడ పుట్టిన ప్రతిప్రాణీ మరణిస్తుంది. భూలోకానికి క్రింద జలలోకమున్నది. అది క్రిందఉన్న లోకాలచేత పొందబడుచున్నది. ఈ లోకాలన్నీ పంచభూతాలచే నిర్మించబడ్డాయి.

లోకాలను సృష్టించిన తరువాత 'ఈ లోకాలను రక్షించేవాళ్ళు లేకపోతే అవి నాశనమై పోతాయి. కాబట్టి లోకపాలకులను సృష్టించాలి' అని ఆలోచించి పంచభూతాలలోను ప్రధానమైనదైన జలాన్ని తీసుకుని దానితో అవయవాలుగల ఒక మానవాకారాన్ని సృష్టించింది. ఆ ఆకారమే విరాట్స్వరూపము. ఇక ఇంద్రియాధిష్ఠాన దేవతల సృష్టి.

పరమాత్మ ఈ విరాట్స్వరూపాన్ని దృష్టిలో ఉంచుకుని తీవ్రమైన ఆలోచన చేశాడు. అదే తపస్సు, దాని ఫలితంగా విరాట్స్వరూపానికి నోరు వచ్చింది. ఆ నోటి నుండి మాట, మాట నుండి వాణికి అభిమాన దేవత అయిన అగ్ని ఉత్పన్నమైనాయి. తరువాత ముక్కు రంధ్రాలు వచ్చాయి. వాటినుండి ప్రాణం ఉత్పన్నమైంది. అనగా వాసన చూసే శక్తి పుట్టింది. ఆ ఘ్రాణశక్తి నుండి వాయువు పుట్టింది. తరువాత నేత్రాలు వచ్చాయి. వాటినుండి సూర్యుడు ఉద్భవించాడు. తరువాత చెవులు ఏర్పడ్డాయి. వాటి నుండి దిక్కులు వచ్చాయి. తరువాత చర్మము దాని నుండి స్పర్శకు కారణమైన రోమాలు ఏర్పడ్డాయి. చర్మము నుండే ఓషధులు వనస్పతులు ఏర్పడ్డాయి. తరువాత హృదయము దానినుండి మనస్సు, దాని నుండి చంద్రుడు పుట్టారు. తరువాత నాభి, దాని నుండి అపానము, దాని నుండి మృత్యువు ఉద్భవించాయి. తరువాత పురుష జననేంద్రియము, దాని నుంచి వీర్యము, దానికి అధిష్ఠానమైన జలము పుట్టాయి. ఈ రకంగా విరాట్స్వరూపుని అవయవాల నుండి ఇంద్రియాలు, వాటి అభిమానదేవతలు పుట్టారు.

పరమేశ్వరునిచే లోకపాలకులుగా సృష్టించబడ్డ అగ్ని మొదలైన ఇంద్రియాభిమాన దేవతలు అవిద్యతో కూడిన మహాసముద్రంలో పడ్డారు. దానికి అంతం లేదు. అది ఇంద్రియాలవల్ల కలిగే క్షణిక సుఖాలతో కూడినది.

పరమేశ్వరుడు ఆ విరాట్స్వరూపానికి ఆకలి దప్పికలు కలిగేలా చేశాడు. అప్పుడు దేవతలందరూ మేము కూర్చుని భుజించేందుకు వీలుగా, మాకు తగిన స్థానాన్ని ప్రసాదించమని వేడుకున్నారు. ఆకలి తీరాలంటే ఆహారం కావాలి. అన్ని ఇంద్రియాలకు ఆహారం అన్నమేకాదు. వాటి ఆహారము వేరుగా ఉంటుంది.

అప్పుడు దేవతలకోసం పరమేశ్వరుడు ఆవును సృష్టించాడు. దేవతలు ఇది మాకు సరిపోదు అన్నారు. గుర్రాన్ని సృష్టించాడు. అది చాలదన్నారు. అప్పుడు విరాట్స్వరూపాన్ని పోలిన పురుషుడినే సృష్టించాడు. దాన్ని చూసిన దేవతలు ఇది చాలా బాగుంది అని సంతసించారు. పరమేశ్వరుని ఆజ్ఞానుసారం ఇంద్రియాది దేవతలంతా వారివారి స్థానాల్లో ప్రవేశించారు. అంటే అగ్ని వాగ్రూపం ధరించి పురుషుని నోటిలో ప్రవేశించింది. వాయువు ప్రాణరూపం ధరించి ముక్కులో ప్రవేశించింది. సూర్యుడు దృష్టిరూపంలో నేత్రాలలోను, దిక్కులు చెవులయందు, ఓషధులు, వనస్పతులు చర్మమునందు, చంద్రుడు మనోరూపం ధరించి హృదయ మందు, మృత్యువు అపానరూపం దాల్చి నాభియందు, జలం వీర్యరూపం దాల్చి జననేంద్రియమందు ప్రవేశించాయి. ఈ రకంగా దేవతలంతా వెళ్ళిపోగా ఇంకమిగిలినవి ఆకలి దప్పికలు. వీరిద్దరినీ పరమేశ్వరుడు దేవతలందరిలోనూ భాగస్వాములుగా చేశాడు. దీనివల్ల ఏ దేవతకు హవిస్సు ఇచ్చినా, దానిలో ఆకలి దప్పికలకు కూడా భాగం కలుగుతుంది. కంటికి ఆకలి దప్పిక అంటే చూడాలనే కోరిక. చెవులకు వినాలనే కోరిక.

ఈ రకంగా ఇంద్రియాలను వాటి అధిష్ఠాన దేవతలను సృష్టించిన తరువాత అన్నాన్ని సృష్టించవలసి వచ్చింది. అప్పుడు జలం నుంచి ఆహారం సృష్టించాడు. అదే అన్నము.

ఇప్పుడు పరమేశ్వరుడు ఇంద్రియాలతోకూడిన మానవశరీరంలో ప్రవేశించా లనుకున్నాడు. దానికి రెండు మార్గాలున్నాయి. 1. పాదాల చివర నుంచి అంటే క్రింది నుంచి, 2. శిరస్సు నుంచి అంటే బ్రహ్మరంధ్రం నుంచి. పరమేశ్వరుడు బ్రహ్మరంధ్రం ద్వారా మానవశరీరంలో ప్రవేశించాడు.

ఈ రకంగా పరమేశ్వరుడు జీవకోటిని సృష్టించి, తాను ఆ జీవకోటిలో ప్రవేశించి జగత్తంతా తానే అయినాడు." అని చెప్పబడింది.

**పురుషసూక్తం**లో పరమేశ్వరుడే ఈ జగత్తును సృష్టించాడు అని చెబుతూ, ఆ పరమేశ్వరుని ముఖము నుంచి–బ్రాహ్మణులు, బాహువుల నుంచి – క్షత్రియులు,

ఊరువుల నుంచి – వైశ్యులు, పాదములనుంచి – శూద్రులు, మనస్సునుంచి – చంద్రుడు, కనులనుంచి – సూర్యుడు, ముఖము నుంచి – ఇంద్రుడు, అగ్ని, ప్రాణముల నుంచి – వాయువులు, నాభినుంచి – అంతరిక్షము, పాదములనుంచి – భూమి, శ్రోత్రముల నుంచి దిక్కులు ఉద్భవించాయి. అని చెప్పబడింది.

ఈ రకంగా పరమేశ్వర స్వరూపం నుంచే చరాచరజగత్తంతా ఆవిర్భవించింది. ఈ దేహము పాంచభౌతికమైనది. శరీరంలో శ్రోత్రాదులు అంటే కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మము. ఇవి జ్ఞానేంద్రియాలు. వీటిలో శ్రోత్రము – ఆకాశాంశ, చర్మము – వాయు అంశ, కనులు – అగ్ని, నాలుక – జలము, ముక్కు – భూమి. అలాగే కర్మేంద్రియాలు కూడా పంచభూతాల నుండి కలిగినవే. ఈ విధంగా చరాచర జగత్తంతా పరబ్రహ్మ స్వరూపంతప్ప వేరుకాదు.

ఈ రకంగా చరాచర జగత్తులో 84 లక్షల రకాలయిన జీవరాశి ఆవిర్భవించింది.

**పైంగలోపనిషత్తు**లో సృష్టిని గురించి చెప్పబడింది. ఈ సృష్టికి పూర్వము పరమాత్మ ఒక్కడే ఉన్నాడు. అదే ఆత్మ. అది నిత్యముక్తమైనది. వికారములు లేనిది. సత్యజ్ఞానానందమయమైనది. పరిపూర్ణమైనది. సనాతనముగా ఉన్నది. ఏకముగా ఉన్నది. రెండవది లేనిది. అదే పరబ్రహ్మ. ఆ బ్రహ్మయందు ఎడారులలో మృగతృష్ణలాగా, ముత్యపు చిప్పలో వెండిలాగా, స్థాణువునందు దొంగవాడిలాగా, స్ఫటికంలోని రేఖలలాగా, అనిపిస్తూ ఎరుపు, తెలుపు, నలుపు, గల సమాన త్రిగుణాలు గలిగి, అనిర్వచనీయమైన మూలప్రకృతి ఉన్నది. ఆ మూల ప్రకృతిలోప్రతిబింబించిన పరబ్రహ్మమే సాక్షిచైతన్యముగా ఉన్నది. ఆ మూల ప్రకృతి మళ్ళీ వికారము పొంది సత్త్వగుణమువల్ల ఉద్రేకము పొంది అవ్యక్తమనే పేరుతో ఆవరణ శక్తిగా ఉన్నది. ఈ ఆవరణలో ప్రతిబింబించిన పరబ్రహ్మ ఈశ్వరచైతన్యము.

ఈ అవ్యక్తాన్ని స్వాధీనంలో ఉంచుకున్నవాడు పరమేశ్వరుడు. సృష్టి స్థితి లయాలకు కారణభూతుడు అవుతూ జగత్తుకు అంకురముగా ఉన్నాడు. ఈశ్వరుడు తనయందు లీనమైన జగత్తులో అంతటా తానే ఆవిర్భవింపజేసి ఉన్నాడు. ఇతడే ప్రాణులకు వారి కర్మలననుసరించి ఫలితాన్ని ఇస్తున్నాడు. ఈశ్వరుడే అధిష్ఠానముగా

ఉన్న ఆ పరమశక్తి నుండి రజోగుణముతో ఉద్రిక్తమైన మహత్తు అనే పేరుగల విక్షేప శక్తి ఏర్పడింది. ఈ మహత్తునందు ప్రతిఫలించిన బ్రహ్మము హిరణ్యగర్భుడు అనబడుతోంది. ఆ హిరణ్యగర్భుడు మహత్తత్త్వమునందు అభిమానము గలవాడై స్పష్టమైనది, అస్పష్టమైనది అయిన శరీరము ధరించాడు.

హిరణ్యగర్భునిచే అధిష్ఠింపబడిన మహత్తునుండి (విక్షేపశక్తి) తమోగుణ ప్రధానమైన అహంకారము అనే స్థూలశక్తి వచ్చింది. అటువంటి అహంకారమునందు ప్రతిబింబించిన పరబ్రహ్మ విరాట్ అనే చైతన్యముగా ఉన్నది. ఆ విరాడ్రూపమే శ్రీమహావిష్ణువుగా ఉన్నాడు. ఆ విరాట్పురుషుని నుంచి సూక్ష్మాకాశ భూతము పుట్టింది. ఆకాశము నుంచి వాయువు, వాయువు నుంచి అగ్ని, అగ్ని నుంచి జలము, జలము నుంచి భూమి పుట్టినాయి. సూక్ష్మభూతాలుగా ఉన్న ఈ తన్మాత్రలు త్రిగుణ సహితముగా ఉన్నాయి. సృష్టి చెయ్యాలనే సంకల్పంగల ఆ జగత్కర్త, తమోగుణముతో సూక్ష్మపంచభూతాలను స్థూలం చెయ్యాలి అనుకున్నాడు. సృష్టికి పరిమితమైన సూక్ష్మ పంచభూతాలలో ఒక్కొక్క భూతాన్ని రెండు భాగాలుగా చేశాడు. ప్రతిభూతములోను మొదటి భాగాన్ని అలాగే ఉంచి, రెండవభాగాన్ని నాలుగు భాగాలుగా చేశాడు. ఇందులో ఒక్కొక్క భాగంలోను మిగిలిన భూతముల ద్వితీయాంశలను కలిపి పంచీకరణ చేశాడు. అప్పుడు పంచీకరణ ఎలా జరిగిందంటే – భూమిని రెండు భాగాలుగా చేశాడు. అందులో మొదటి సగం భూమి. మిగిలిన సగభాగాన్ని నాలుగు ముక్కలుగా చేశాడు. ఇదే రకంగా అన్ని భూతాలను విభజించి, రెండవ సగంలో మిగిలిన భూతాలను ఉంచాడు. అంటే భూమిలో 1/2 భూమి, ఆకాశము 1/8, వాయువు 1/8, అగ్ని 1/8, జలము 1/8. ఇది పృథివీ పంచీకరణము. ఈ విధంగా పంచీకరించిన భూతాలతో అనంతకోటి బ్రహ్మాండాలను, లోకాలను, గోళాలను సృష్టించాడు.

ఈశ్వరుడు పంచమహాభూతాలయొక్క రజోగుణ భాగాలను నాలుగు భాగాలుగా చేసి, ఆ భాగములలో మూడు భాగాల నుండి ప్రాణశక్తిని సృష్టించాడు. తరువాత పంచభూతముల నాల్గవభాగంతో కర్మేంద్రియాలను సృష్టించాడు. తరువాత ఆ

ఈశ్వరుడు పంచభూతాల సత్వాంశలను నాలుగు భాగాలు చేశాడు. అందులో మూడు భాగాల నుంచి అంతఃకరణను సృష్టించాడు. తరవాత నాల్గవ సత్వభాగముతో జ్ఞానేంద్రియాలను సృష్టించాడు. సత్త్వసమష్టివల్ల ఇంద్రియ పాలకులైన దేవతలను సృష్టించాడు. ఈ రకంగా సృష్టించబడిన ఇంద్రియాలను అండములోపల వ్యాపింప చేశాడు. ఈశ్వరుని ఆజ్ఞతో సృష్టించబడినవన్నీ అండమంతటా పూర్తిగా వ్యాపించి ఉన్నాయి. ఈశ్వరుని ఆజ్ఞతో అహంకార సహిత విరాట్టు సమస్త స్థూలాన్ని సృష్టించాడు. ఈశ్వరుని ఆజ్ఞతో హిరణ్యగర్భుడు సూక్ష్మభూతాలను పరిపాలించాడు.

అండములో ఉన్న దేహేంద్రియాలు, చైతన్యమూర్తి అయిన ఈశ్వరుడు లేకుండా, స్పందన కలిగి ఉండటానికి, పని చేయటానికి సమర్థత లేకుండా ఉన్నాయి. ఈశ్వరుడు ఆ దేహాదులను చైతన్యవంతులుగా చెయ్యాలని సంకల్పించాడు. బ్రహ్మాండాలను, బ్రహ్మరంధ్రములను, సమస్త వ్యష్టిశరీర మస్తకములను బ్రద్దలు చేసి వాటన్నింటి యందు చైతన్యరూపంతో తాను ప్రవేశించాడు. అంటే జగత్తులో ఉన్న జీవరాశి యందంతటా తాను ప్రవేశించాడని అర్థం. ఈ శరీరాలన్నీ మొదట జడములుగా ఉన్నాయి.కాని ఈశ్వరుడు ప్రవేశించగానే చైతన్యవంతమై తమ తమ పనులు చెయ్యటం మొదలుపెట్టినాయి. సర్వజ్ఞుడైన ఈశ్వరుడు మాయాలేశ సమన్వితుడై, మోహపెట్టబడి జీవత్వము పొందాడు. అంటే శరీరంలో ప్రవేశించిన ఈశ్వరుడు మాయచేత అజ్ఞాని అయి కర్తృత్వము, భోక్తృత్వము కలవాడయినాడు. జీవుడుగా ఉన్న ఈశ్వరుడు దేహమే తాను అనేభ్రాంతితో స్థూల సూక్ష్మకారణ దేహాలను అనుభవించటంచేత, మేల్కొనటం, నిద్రపోవటం, కలలు కనటం మరణించటం అనే ధర్మాలు గలవాడై కుమ్మరివాని సారెలాగా సంసారచక్రంలో పరిభ్రమిస్తున్నాడు అని చెప్పబడింది.

# 9. పురాణాలు - జగత్సృష్టి

శ్రీమద్భాగవతంలోని మూడవ స్కంధంలో సృష్టికర్త అయిన బ్రహ్మదేవుడు చేసిన సృష్టి గురించి మైత్రేయుడు విదురుడికి చెబుతున్నాడు.

సృష్టి తొమ్మిది విధాలు. వాటిలో ప్రాకృతాలు, వైకృతాలు అనేవి కాలము, ద్రవ్యము, గుణము అనే మూడు విధాలైన భేదాల వల్ల సంకరమవుతుంటాయి. అందులో

**మొదటి సృష్టి** - మహత్తత్త్వం

**రెండవ సృష్టి** - అహంకారం

**మూడవ సృష్టి** - తన్మాత్రలు, పంచభూతాలు

**నాల్గవ సృష్టి** - జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు

**ఐదవ సృష్టి** - సాత్త్వికాహంకారం వల్ల పుట్టిన దేవతలు

**ఆరవ సృష్టి** - జీవికి అజ్ఞానం కలిగించే తామస సృష్టి.

ఈ ఆరు భగవంతుని లీలావిలాసాలయిన ప్రాకృత సృష్టులు. ఇక వైకృత సృష్టిని వివరిస్తున్నాడు.

**ఏడవ సృష్టి** - ఇందులో ఆరురకాల జాతులున్నాయి.

1. పూలు పూయకుండానే ఫలించే రావి, మేడి, పనస మొ॥ వృక్షాలు.
2. పూచి వెంటనే నశించిపోయే యవలు, వడ్లు మొ॥వి
3. పైకి ఎగబ్రాకటానికి అవకాశం లేని మాలతి, మల్లె మొ॥ తీగలు.
4. గట్టి బెరడు కలిగిన వెదుళ్ళు మొ॥వి
5. నేలలో దృఢమైన వేళ్ళు కలిగి బాగా విస్తరించే దుబ్బులు, పొదలు
6. పూలు పూచి కాయలు కాసే మామిడి మొ॥ వృక్షాలు.

**ఎనిమిదవ సృష్టి** - ఇందులో 28 రకాలున్నాయి.

రేపు అనే జ్ఞానం లేనివి, ఆహారమందు మాత్రమే ఆసక్తి గలవి, వాసన చూసి తెలుసుకోగలవి, మనసుతో ఆలోచన చేయలేనివి, చీలిన గిట్టలు గలవి, చీలని గిట్టలు గలవి, ఐదు గోళ్ళు గల కుక్క, నక్క తోడేలు మొ॥వి, ఇవన్నీ భూచరాలు.

మొసలి మొదలైన జలచరాలు, రాబందు, గ్రద్ద, కొంగ, గబ్బిలం, నెమలి, హంస, గుడ్లగూబ మొ॥ ఖగచరాలు.

**తొమ్మిదవ సృష్టి** – మానవుడు. రజోగుణం కలిగి, కర్మలు చేయకలిగి, దుఃఖంలో కూడా సుఖాన్ని కోరుకునేవాడు.

**పదవ సృష్టి :** ఇక దేవసర్గను చూద్దాం. ఇది కూడా ఎనిమిది రకాలు.

1. విబుధులు
2. పితృదేవతలు
3. దేవతలు
4. గంధర్వులు, అప్సరసలు
5. యక్షులు, రాక్షసులు
6. భూతప్రేత పిశాచాలు
7. సిద్ధచారణ విద్యాధరులు
8. కిన్నరలు, కింపురుషులు

ఈ విధంగా బ్రహ్మదేవుడు పదిరకాలైన సృష్టులు చేశాడు.

కల్పారంభంలో శ్రీమహావిష్ణువు ఈ రకంగా సృష్టి చేశాడు. ఈ కల్పంలో ఉన్న దేవతలు, రాక్షసులు మొదలైన వారందరూ ప్రతికల్పంలోను అదే పేర్లతో ఇలాగే వ్యవహరించబడతారు. ఇక్కడ ఇంకొక విషేషం ఏమంటే, కౌమారసర్గం అనేది దేవసర్గంలోని భాగమే అయినప్పటికి ప్రాకృత, వైకృతాలు రెండింటి స్వభావము కలిగి ఉంటుంది. అందులో దైవత్వము, మనుష్యత్వము కలిసి ఉంటాయి. ఇదే సనత్కుమారాది సర్గము.

**కాలస్వభావము :** ఒక వస్తువును ముక్కలు ముక్కలుగా చేస్తే అందులోని అతిచిన్న అంశకు పరమాణువు అని పేరు. దీన్ని ఇంక విభజించటానికి వీలుకాదు.

రెండు పరమాణువులు – ఒక **అణువు**

మూడు అణువులు – ఒక **త్రసరేణువు**

మూడు త్రసరేణువులు – ఒక **త్రుటి**

| | | |
|---|---|---|
| నూరు త్రుటులు | – | ఒక **'వేధ'** |
| మూడు వేధలు | – | ఒక **లవము** |
| మూడు లవాలు | – | ఒక **నిమేషము** |
| మూడు నిమేషాలు | – | ఒక **క్షణం** |
| ఐదు క్షణాలు | – | ఒక **కాష్ఠ** |
| పది కాష్ఠలు | – | ఒక **లఘువు** |
| పదిహేను లఘువులు | – | ఒక **నాడి** |
| రెండు నాడులు | – | ఒక **ముహూర్తం** |
| మూడు ముహూర్తాలు | – | ఒక **యామము** లేదా **జాము** |

**దిన పరిమాణము :**

| | | |
|---|---|---|
| నాలుగు జాములు | – | ఒక **పగలు** లేదా **రాత్రి** |
| ఒక రాత్రి ఒక పగలు | – | మానవులకు ఒక **రోజు** |
| పదిహేను రోజులు | – | ఒక **పక్షం**. శుక్ల, కృష్ణ పక్షాలు |
| రెండు పక్షాలు | – | ఒక **మాసం** పితృదేవతలకు ఒకరోజు |
| రెండు మాసాలు | – | ఒక **ఋతువు** |
| మూడు ఋతువులు | – | ఒక **అయనం**. ఉత్తరాయణం, దక్షిణాయనం |
| రెండు అయనాలు | – | ఒక **సంవత్సరం**. దేవతలకు |

నెలకు ఒకరాశి చొప్పున సంవత్సరం పూర్తయ్యేసరికి సూర్యుడు పన్నెండు రాశుల యందు తిరుగుతాడు. సూర్యగమనాన్ని బట్టి రోజులు లెక్కించటం సౌరమానం. ప్రతి రాశియందు 2 1/2 రోజుల చొప్పున చంద్రుడు నెలపూర్తయ్యేసరికి 12 రాశులయందు తిరుగుతాడు. చంద్రగమనాన్ని బట్టి రోజులు లెక్కించటమే చాంద్రమానం. ఈ రకంగా సూర్యగమనం వల్ల సౌరమానము, చంద్రగమనం వల్ల చాంద్రమానము లెక్కించబడతాయి. సూర్యచంద్రుల గమనంలో తేడావల్ల సౌరమాన చాంద్రమానాల్లో తేడాలు వస్తాయి. కాని సూర్యుడు మకరరాశిలో ప్రవేశించే నాటికి సామాన్యంగా ఈ తేడాలు సరిచేయబడతాయి.

ఇంచుమించుగా ప్రతి పురాణంలోను సృష్టి విధానము ఇలాగే ఉంటుంది.

**సూత సంహిత**లో సృష్టిని గురించి ఈ విధంగా ఉంది.

పరమేశ్వరుని కృపతో బ్రహ్మదేవుడికి తమము, మోహము, మహామోహము, తామిస్రము, అంధతామిస్రము అనే ఐదు భాగాలైన సృష్టి అవిద్యాపరంగా గోచరించింది. లోపలా బయటా కూడా లీలామాత్రంగా వృక్షాలు, పర్వతాలతో కూడిన స్థావరాత్మకమైన అంధకారమైన సర్గము కనిపించింది. ప్రస్ఫుటంగా లేని లీలామాత్రంగా గోచరిస్తున్న స్థావరాత్మకమైన సర్గము ఐహిక ఆముష్మికాలకు ఉపకరించేది కాదని భావించి, మళ్ళీ సృష్టించాలనుకుని సుఖదుఃఖాలతో కూడిన పశువర్గాన్ని సృష్టించాడు. దీన్ని కూడా పై దానిలాగే భావించి మళ్ళీ సృష్టి చెయ్యాలనుకుని సత్త్వగుణ సంపన్నమైన దేవసర్గను సృష్టించాడు. ఆ తరువాత రజోగుణ సంపన్నమైన మనుష్య సర్గను సృష్టించాడు. ఆఖరుగా ఐదవది అయిన భూతప్రేత పిశాచ సర్గను సృష్టించాడు. ఈ రకంగా ఐదు విభాగాలయిన ప్రాకృత సృష్టి జరిగింది.

ఇక వైకృత సృష్టి తొమ్మిది రకాలుగా ఉన్నది. అవి

1. మొదటి సర్గ – మహత్తత్త్వము
2. రెండవ సర్గ – పంచతన్మాత్రలు, పంచభూతాలు
3. మూడవ సర్గ – జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు
4. నాల్గవ సర్గ – స్థావరాలు (చెట్లు, వృక్షాలు, కొండలు)
5. ఐదవ సర్గ – పశువులు, పక్షులు
6. ఆరవ సర్గ – దేవతలు
7. ఏడవ సర్గ – మానవులు
8. ఎనిమిదవ సర్గ – భూతప్రేతాలు
9. తొమ్మిదవ సర్గ – కౌమారసర్గ, సనకాదులు

ఈ రకంగా ప్రాకృత వైకృతాలతో పద్నాలుగు విభాగాలైన సృష్టి జరిగింది.

# 10. వేదాంత దర్శనము

వేదాంతము అంటే అద్వైతమే. ద్వైతంలో ఉన్నది భక్తికి సంబంధించినది. సాధకుడు సాకార బ్రహ్మోపసన చేసి బ్రహ్మలోకం పొంది, అక్కడ సాకార బ్రహ్మను సేవిస్తూ అక్కడే ఉండిపోతాడు. అదే 'మోక్షము' అంటారు ద్వైతులు.

అద్వైతమే వేదాంతమని అద్వైతాన్ని విమర్శించే వారే ఒప్పుకున్నారు. బాదరాయణుడు వ్రాసిన బ్రహ్మ సూత్రాలలో ప్రతిపాదించిన మతము అద్వైతమే. ఇదే వేదాంతము. అంతేకాని విశిష్టాద్వైతము మొ॥వి వేదాంతం కావు. **లోకంలో వేదాంతము అంటే అద్వైతమే అని సామాన్యార్థము.** నూనె అంటే నువ్వుల నుండి తీసినదే నూనె. ఇతర రకాలైన నూనెలను వాటి పేర్లతో పిలుస్తారు. శనగనూనె, వేపనూనె, కొబ్బరి నూనె మొ॥వి ఏమీ లేకుండా నూనె అంటే నువ్వుల నూనె అనే అర్థం. అలాగే పాలు అంటే ఆవుపాలు అనే అర్థం. మిగిలిన వాటికి ఆ జంతువుల పేర్లతో పిలుస్తారు. గేదెపాలు, మేకపాలు మొ॥వి అలాగే వేదాంతము అంటే శంకరుల అద్వైతసిద్ధాంతము అనే గుర్తించాలి.

అద్వైతము. న+ద్వైతము. రెండు కానిది. రెండు లేనిది. బ్రహ్మమే జగద్రూపంగా పరిణమించింది అని చెప్పటం. బ్రహ్మముకు – జగత్తుకు తేడా లేదు.

వేదాంతుల దృష్టిలో ఉపనిషత్తులన్నీ ఈశ్వరవచనాలు. శ్రుతులు ఆత్మ, పరమాత్మ శబ్దాలు రెండూ పర్యాయపదాలు అంటున్నాయి. అతీంద్రియ జ్ఞానం గల ఋషులు బ్రహ్మాండము అంటే జగత్తు అని, పిండాండము అంటే శరీరము అని తెలుసుకున్నారు. ఈ జగత్తుకు లోపల, బయట ఉన్న పదార్థమంతా పరబ్రహ్మమే. అనే విషయం తెలుసుకున్నారు. ఆ పరబ్రహ్మమే శరీరంలో ఉన్న ఆత్మ. జగత్తు, శరీరము రెండూ అనిత్యములు. ఆత్మ ఒక్కటే సత్యము, నిత్యము శాశ్వతమైనది. **సర్వంఖల్విదంబ్రహ్మ** జగత్తంతా బ్రహ్మమయము. **నేహ నానాస్తి కించన** అంతకన్న వేరైనది ఏదీలేదు.

బ్రహ్మము ప్రత్యక్ష, అనుమాన ప్రమాణముల చేత తెలియబడదు. ఆప్తవాక్యము వల్ల అవిద్య తొలగిపోయి బ్రహ్మము యొక్క పరోక్ష జ్ఞానం కలుగుతుంది. కాబట్టి శబ్దప్రమాణంతో (శ్రుతివాక్యాలతో) బ్రహ్మమును గురించి తెలుస్తుంది. ప్రపంచంలో ఉన్న గ్రంథాలన్నింటిలోను శ్రేష్ఠమైనవి వేదాలు.

| | | |
|---|---|---|
| వేదాలలో | - | ఉపనిషత్తులు శ్రేష్ఠము |
| ఉపనిషత్తులలో | - | దశోపనిషత్తులు శ్రేష్ఠతరములు |
| దశోపనిషత్తులలో | - | మహావాక్యాలు శ్రేష్ఠతమమైనవి |

వేదాలు నాలుగు. ప్రతి వేదానికి కొన్ని ఉపనిషత్తులున్నాయి.

| | | | |
|---|---|---|---|
| ఋగ్వేదానికి | 21 | యజుర్వేదానికి | 109 |
| సామవేదానికి | 1000 | అధర్వణ వేదానికి | 50 |

వెరసి 1180 ఉపనిషత్తులున్నాయి. మంత్ర, యంత్ర, తంత్రాలు, సాధన, ఉపాసన మార్గాలు ఉపనిషత్తులు మాత్రవే దొరుకుతున్నాయి. అయితే ముక్తికోపనిషత్తులో శ్రీరామచంద్రుడు 108 ఉపనిషత్తుల పేర్లు చెబుతాడు. వీటిలో

| | | | |
|---|---|---|---|
| సన్యాసోపనిషత్తులు | 17 | యోగోపనిషత్తులు | 20 |
| వేదాంతోపనిషత్తులు | 24 | వైష్ణవోపనిషత్తులు | 14 |
| శైవోపనిషత్తులు | 15 | శాక్తేయోపనిషత్తులు | 8 |
| దశోపనిషత్తులు | 10 | | |

వీటిలో దశోపనిషత్తులు ముఖ్యమైనవి. వీటికి త్రిమతాచార్యులు తమ తమ మతాలకు అనుకూలంగా భాష్యాలు వ్రాశారు. ఈ పది ఉపనిషత్తులలోను నాలుగు వేదాలకు సంబంధించిన ఒక్కొక్క ఉపనిషత్తు నుంచి ఒక్కొక్కటి చొప్పున, నాలుగు ఉపనిషత్తుల నుంచి నాలుగు వాక్యాలను తీసుకున్నారు. వీటినే మహావాక్యాలు అంటారు. అవి :

| | | | |
|---|---|---|---|
| 1. | ప్రజ్ఞానం బ్రహ్మ | ఐతరేయోపనిషత్తు | ఋగ్వేదము |
| 2. | అహంబ్రహ్మాస్మి | బృహదారణ్యకోపనిషత్తు | శుక్లయజుర్వేదము |
| 3. | తత్త్వమసి | ఛాందోగ్యోపనిషత్తు | సామవేదము |
| 4. | అయమాత్మాబ్రహ్మ | మాండూక్యోపనిషత్తు | అథర్వణవేదము |

మహావాక్యాలన్నింటి అర్థం ఒక్కటే. జీవాత్మ పరమాత్మ రెండూ ఒకటే. వీటి మధ్య భేదం లేదు. వీటిలో **తత్త్వమసి** అనే మహావాక్యానికి అర్థం తెలిస్తే మిగిలిన మహావాక్యాలకు అర్థం తెలుస్తుంది. ఇప్పుడు **తత్త్వమసి** మహావాక్యార్థం చూద్దాం.

# 11. తత్త్వమసి - 2

తత్త్వమసి అనే మహావాక్యం మూడు పదాలుగా ఉన్నది అని చెప్పుకున్నాం. తత్, త్వం, అసి. అదే నీవై ఉన్నావు. ఇందులో **త్వం** శబ్దార్థాన్ని పూర్తిగా విచారించాల్సి ఉంటుంది. **త్వం** అంటే నీవు అని అర్థం. లోకంలో 'నేను' అని చెప్పినప్పుడు దేన్నైతే ఉద్దేశించి చెబుతున్నామో, దాన్నే ఎదుటి వారిలో 'నీవు' అంటున్నావు. కాబట్టి ఇక్కడ నేను అన్నా, నీవు అన్నా రెండింటికీ అర్థం ఒకటే. 'నీవు' అంటే ఎవరు? అనేదే **త్వం** శబ్ద విచారణ.

నువ్వు అంటే శరీరమా? కాదు. ఎందుకంటే శరీరంలో అనేక పదార్థాలున్నాయి. జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, సప్తధాతువులు ఉన్నాయి. వాటిలో ఏదీ నువ్వుకాదు. పోనీ అన్నీ కలిసిన సమష్టి రూపము నువ్వా అంటే అదీకాదు. నీ దగ్గర ఉన్న వస్తువులను ఇది గోడ, ఇది బల్ల, ఇది పుస్తకము అని ఎలా తెలుసుకున్నావో అలాగే నీ శరీరాన్ని గురించి కూడా తెలుసుకుంటున్నావు.

గోడ – నువ్వు కాదు, బల్ల – నువ్వు కాదు, పుస్తకము – నువ్వు కాదు. అలాగే శరీరం కూడా – నువ్వు కాదు.

శరీరంలోని ఇంద్రియాలు స్వతంత్రంగా పని చెయ్యలేవు. వాటికి పనిచేసే శక్తినిచ్చేది ఇంకోటుంది. అదే ఆత్మ–చైతన్యము. ఆ ఆత్మ చైతన్యమే నీవు. సర్వానికి సాక్షి అయిన వాడివి నువ్వు. శరీరము – నువ్వుకాదు. ఇంద్రియాలు – నువ్వు కాదు. పంచభూతాలు – నువ్వు కాదు. తన్మాత్రలు – నువ్వు కాదు, మరి నువ్వెవరివి అంటే చిదానందరూపమైన బ్రహ్మానివి. ఇదే విషయాన్ని శంకరుల వారు తమ **నిర్వాణషట్కం**లో చెబుతారు.

**మనోబుద్ధ్యహంకార చిత్తాని నాహం**

**నకర్ణం (నశ్రోత్రం) నజిహ్వా నచ ఘ్రాణ నేత్రే**

**నచ వ్యోమ భూమి ర్న తేజో నవాయుః**

**చిదానందరూప శ్శివోహం శ్శివోఽహమ్ ॥** 1

అంతఃకరణ చతుష్టయం (మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము) నేను కాను. జ్ఞానేంద్రియాలు నేను కాను. పంచభూతాలు నేను కాను. చిదానందరూపుడైన పరబ్రహ్మను నేనే.

**నచ ప్రాణసంజ్ఞో నవై పంచవాయు**
**ర్న వా సప్తధాతు ర్నవా పంచకోశాః**
**న వాక్పాణి పాదౌ న చోపస్థ పాయూ**
**చిదానందరూప శ్శివోహం శ్శివోఽహమ్ ॥ 2**

పంచప్రాణాలు నేను కాను. సప్తధాతువులు నేను కాను. పంచకోశములు నేను కాను. కర్మేంద్రియాలు నేను కాను. చిదానందరూపుడైన పరబ్రహ్మను నేనే.

**న మే ద్వేషరాగౌ న మే లోభమోహౌ**
**మదో నైవ మే నైవ మాత్సర్య భావః ।**
**న ధర్మో న చార్థో న కామో న మోక్షః**
**చిదానంద రూప శ్శివోహం శివోఽహమ్ ॥ 3**

అరిషడ్వర్గాలు, రాగద్వేషాలు నావి కావు. చతుర్విధ పురుషార్థాలు నావి కావు. చిదానందరూపుడైన పరబ్రహ్మను నేను.

**న పుణ్యం న పాపం న సౌఖ్యం న దుఃఖం**
**న మన్త్రో న తీర్థం న వేదా న యజ్ఞాః**
**అహం భోజనం నైవ భోజ్యం న భోక్తా**
**చిదానందరూప శ్శివోహం శ్శివోఽహమ్ ॥ 4**

పుణ్యపాపాలు, సుఖదుఃఖాలు, మంత్ర తంత్రాలు, వేదాలు, వేదవిహితమైన యజ్ఞాలు, తినే పదార్థాం నేను కాదు. తినేది నేను కాదు. నేను చిదానందరూపుడైన పరబ్రహ్మను.

**న మృత్యు ర్న శంకా న మే జాతిభేదః**
**పితా నైవ మే నైవ మాతా చ జన్మ**

**న బంధు ర్న మిత్రం గురు ర్నైవ శిష్యః**

**చిదానందరూప శ్శివోహం శ్శివో౽హమ్ ॥ 5**

నాకు (ఆత్మకు) మరణం లేదు. స్త్రీ పురుష నపుంసక జాతి భేదంలేదు. జనన మరణాలు లేవు. గురువు లేడు. శిష్యుడు లేడు. నేను చిదానందరూపుడైన పరబ్రహ్మను.

**అహం నిర్వికల్పో నిరాకార రూపో**

**విభుత్వాచ్చ సర్వత్ర సర్వేంద్రియాణామ్ ।**

**న చా సంగతం నైవ ముక్తి ర్న బన్ధః**

**చిదానందరూప శ్శివోహం శ్శివో౽హమ్ ॥ 6**

నాకు ఏ విధమైన విశేషాలు లేవు. నాకు ఆకారం లేదు. పేరు లేదు. నేను సర్వవ్యాపకుడను, అన్ని దేశాలయందు, అన్ని కాలాలయందు ఉంటాను. అన్ని వస్తువుల యందు, జీవులయందు ఉంటాను. నేను చిదానందరూపుడైన పరబ్రహ్మను అన్నారు శంకరులు. తత్త్వమసి అనే మహావాక్యంలో జీవాత్మ పరమాత్మలకు భేదం లేదు. ఆ రెండూ ఒకటే. ఈ విషయం చెప్పటానికే **ఛాందోగ్యోపనిషత్తు**లో ఉద్దాలకుడు తన కుమారుడైన శ్వేతకేతువుకు బ్రహ్మవిద్యను బోధిస్తూ శ్వేతకేతూ తత్త్వమసి. అదే నీవై ఉన్నావు. ఆ పరమాత్మవే నీవు అంటాడు. తత్త్వమసి అనే మహావాక్యానికి అర్థం తెలిస్తే, మిగిలిన మహావాక్యాలన్నింటికీ అర్థం తెలిసినట్లే. అందుకే **శుకరహస్యోపనిషత్తు**లో సదాశివుడు వ్యాసుని కుమారుడైన శుకుడికి తత్త్వమసి అనే మహావాక్యాన్ని షడంగాలతో బోధిస్తాడు.

నేనే పరబ్రహ్మ స్వరూపాన్ని అని చెబుతున్నారు. భగవత్పాదుల వారు తమ **స్వరూపానందాష్టకం**లో

**తపో యజ్ఞ దానాదిభి శ్శుద్ధబుద్ధి**

**ర్విరక్తో నృపాదేఃపదేతుచ్ఛబుద్ధ్యా ।**

**పరిత్యజ్య సర్వం యదాప్నోతి తత్త్వం**

**పరంబ్రహ్మ నిత్యం తదే వాహ మస్మి ॥ 1**

శాస్త్రప్రకారము యజ్ఞదాన తపస్సులు చేయటం వల్ల చిత్తము పరిశుద్ధమై మహారాజ పదవిని కూడా అల్పముగా భావించి, దృఢమైన చిత్తము గలవాడై, విరక్తి కలిగి దృశ్యమానమైన జగత్తును పరిత్యజించి బ్రహ్మవిదుడు ఏ తత్త్వాన్నైతే పొందుతున్నాడో, నిత్యమైన ఆ పరబ్రహ్మ తత్త్వాన్ని నేను.

**దయాళుం గురుం బ్రహ్మనిష్ఠం ప్రశాన్తం**
**సమారాధ్య మత్యా విచార్య స్వరూపమ్ ।**
**యదాప్నోతి తత్త్వం నిదిధ్యాస్య విద్వాన్**
**పరంబ్రహ్మ నిత్యం తదే వాహ మస్మి ॥** **2**

పరమ దయాస్వరూపుడు, బ్రహ్మనిష్ఠుడు, శాంతగంభీరుడు అయిన గురువుని సేవించి పరిశుద్ధమైన చిత్తముతో ఆత్మయొక్క యథార్థ స్వరూపాన్ని శ్రుతివాక్యాల ద్వారా విచారించి, తెలుసుకుని, మననం చేసి, దానియందే స్థితుడై ఏ తత్త్వాన్ని పొందుతున్నాడో, నిత్యమైన ఆ పరబ్రహ్మతత్త్వాన్ని నేను.

**యదానందరూపం ప్రకాశ స్వరూపం**
**నిరస్త ప్రపంచం పరిచ్ఛేద హీనమ్ ।**
**అహం బ్రహ్మవృత్త్యైక గమ్యం తురీయం**
**పరంబ్రహ్మ నిత్యం తదే వాహ మస్మి ॥** **3**

ఏది ఆనంద స్వరూపమైనదో, ఏది ప్రకాశవంతమైనదో, ఏది ప్రపంచ సంబంధము లేనిదో, ఏది దేశకాల వస్తు పరిచ్ఛేదము లేనిదో, ఏది **'అహంబ్రహ్మాస్మి'** అనే బుద్ధి వృత్తి మాత్రం చేతనే పొందదగినదో, ఏది జాగ్రత్స్వప్న సుషుప్తులకు అతీతమైనదో, నిత్యమైన ఆ పరబ్రహ్మ తత్త్వాని నేను.

**యదజ్ఞానతో భాతి విశ్వం సమస్తం**
**వినష్టం చ సద్యో తదాత్మప్రబోధే**
**మనో వాగతీతం విశుద్ధం విముక్తం**
**పరంబ్రహ్మ నిత్యం తదే వాహ మస్మి ॥** **4**

ఏ బ్రహ్మతత్త్వ తెలియకపోవటం వల్ల ఈ సమస్త జగత్తు ప్రకాశిస్తోందో, ఏ బ్రహ్మతత్త్వము తెలిసినంత మాత్రమే చేత జగత్తంతా నాశనం అవుతోందో, అవాఙ్మానస గోచరము, నిత్యశుద్ధము, నిత్యబుద్ధము, నిత్యముక్తము అయిన ఆ పరబ్రహ్మతత్త్వాన్ని నేను.

**నిషేధేకృతే నేతినేతీతి వాక్యైః**
**సమాధిస్థితానాం యదాభాతి పూర్ణమ్ ।**
**అవస్థా త్రయాతీత మద్వైతమేకం**
**పరంబ్రహ్మ నిత్యం తదే వాహ మస్మి ॥ 5**

నేతి నేతి వాక్యాలతో దృశ్యపదార్థాలన్నింటినీ నిషేధించి సమాధి పొంది ఉన్న మహాత్ములకు ఏ పరిపూర్ణతత్త్వము సాక్షాత్కరిస్తోందో, జాగ్రదాది అవస్థలు, సజాతీయ విజాతీయ భేదాలు, స్వగత భేదాలు లేని నిత్యమైన పరబ్రహ్మ తత్త్వాన్ని నేను.

**య దానందలేశై స్సమానంది విశ్వం**
**య దాభాన సత్వే త దాభాతి సర్వమ్ ।**
**యదాలోకనే రూప మన్య త్సమస్తం**
**పరంబ్రహ్మ నిత్యం తదే వాహ మస్మి ॥ 6**

ఆనందమయమైన ఏ వస్తువు యొక్క ప్రభావంతో సమస్త ప్రాణికోటి ఆనందం పొందుతున్నదో, దేని ప్రకాశము వల్ల సూర్యచంద్రాదులు ప్రకాశిస్తున్నారో, దేన్ని గురించి తెలుసుకున్నంత మాత్రంచేత ఈ జగత్తంతా తెలియబడుతుందో నిత్యమైన ఆ పరబ్రహ్మను నేను.

**అనన్తం విభుం నిర్వికల్పం నిరీహం**
**శివం సంగహీనం యదోంకారగమ్యమ్ ।**
**నిరాకార మత్యుజ్జ్వలం మృత్యు హీనం**
**పరంబ్రహ్మ నిత్యం తదే వాహ మస్మి ॥ 7**

అవధులు లేనిది, సర్వవ్యాపి అయినది, నిష్క్రియమైనది, రూపము లేనిది, మహోజ్జ్వలము, అమృతస్వరూపము, నిత్యము అయిన ఆ పరబ్రహ్మను నేనే.

**యదానంద సింధౌ నిమగ్నః పుమాన్ స్యా**
**దవిద్యావిలాస స్సమస్త ప్రపంచః ।**
**తదా న స్ఫుర త్యద్భుతం యన్నిమిత్తం**
**పరంబ్రహ్మ నిత్యం తదే వాహ మస్మి ॥ 8**

ఆనంద సముద్రము వంటి బ్రహ్మజ్ఞానానుభూతి పొందిన వాడికి ఈ జగత్తు కనిపించదు. సమస్త జగత్తుకు మూలకారణమైన పరబ్రహ్మను నేనే.

**స్వరూపాను సంధాన రూపాం స్తుతిం యః**
**పఠే దాదరాద్భక్తిభావో మనుష్యః ।**
**శృణో తీహ వా నిత్య ముద్యుక్తచిత్తో**
**భవే ద్విష్ణు రత్రైవ వేదప్రమాణాత్॥ 9**

ఆత్మ స్వరూపాన్ని వివరించే ఈ స్తోత్రాన్ని పఠించినవాడు సాక్షాత్తు పరమేశ్వరుడే అవుతాడు. ఇది వేదప్రమాణము. ఏ మాత్రం సందేహం లేదు.

**స్థితో బ్రహ్మాత్మనా జీవో । బ్రహ్మజీవాత్మనా స్థితమ్ ।**
**ఇతి సమ్పశ్యతాం ముక్తిః । ఇతి వేదాంత డిండిమః ॥**

బ్రహ్మమే జీవుడు. జీవుడే బ్రహ్మ. ఈ విషయం పూర్తిగా తెలిసిన వారే ముక్తి పొందుతారని **వేదాంత డిండిమము** చెబుతున్నది.

**వేదాంత డిండిమము** శంకర భగవత్పాదుల వారు వ్రాసిన గ్రంథాలలో ఒకటి. ఇందులో వేదాంతం చెప్పబడింది. దీంట్లో 14వ శ్లోకం ఇప్పుడు పైన చెప్పినది. 15వ శ్లోకంలో

**జీవోబ్రహ్మాత్మనా జ్ఞేయో । జ్ఞేయం జీవాత్మనా పరమ్ ।**
**ముక్తి స్తదైక్య విజ్ఞానాత్ । ఇతి వేదాంత డిండిమః ॥**

జీవుని బ్రహ్మరూపుడు గాను, బ్రహ్మను జీవుడి రూపుడు గాను గ్రహించాలి. ఇద్దరూ ఒక్కటే అనే జ్ఞానము వల్లనే ముక్తి లభిస్తుంది అంటున్నారు.

నువ్వు ఎవరు? అన్నప్పుడు, అన్నింటినీ తెలుసుకుంటూ అన్ని వ్యాపారాలకు సాక్షియైనవాడవు. నిన్న ఉన్నావు. ఇవాళ్ళ ఉన్నావు. రేపు ఉంటావు. నీకు ఆది అంతము లేవు. నువ్వు సత్యము, నిత్యము, శాశ్వతమైన వాడివి. లోకంలో జన్మించినప్పుడు నీ శరీరము అతిచిన్న ఆకారంలో ఉన్నది. కాలక్రమేణా పెరిగి పెద్దదయింది. ముసలితనంలో శరీరం ముడతలు పడుతుంది. జుట్టు నెరుస్తుంది. పళ్ళు ఊడిపోతాయి. ఇదంతా మార్పు. వేదాంత పరిభాషలో 'వికారము' ఆ వికారము నీకు లేదు. నీ శరీరానికి మాత్రమే ఉంది. బాల్యంలో ఉన్న నువ్వే యవ్వనంలోను, వృద్ధాప్యంలోను కూడా ఉన్నావు. నీకు జనన మరణాలు లేవు. వృద్ధిక్షయాలు అంతకన్నా లేవు. వికారాలు లేవు. నువ్వు సత్యజ్ఞానానంద స్వరూపుడివి. ఇది త్వం పదానికి అర్థం.

తత్ – అంటే జ్ఞానస్వరూపమైనది. పరమాత్మ

అసి – అయి ఉన్నావు

కాబట్టి శ్వేతకేతూ ! తత్త్వమసి. అదే నీవై ఉన్నావు. ఆ పరమాత్మ స్వరూపమే నీవై ఉన్నావు. **జీవాత్మ పరమాత్మ రెండూ ఒక్కటే. ఇదే అద్వైత సిద్ధాంతము. సర్వం ఖల్విదం బ్రహ్మ** – జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే. **నేహ నానాస్తి కించన** – అంతకు మించినది ఏదీ లేదు. ఇది తత్త్వమసి అనే మహావాక్యార్థం. అద్వైత సిద్ధాంతం. **ఉపనిషత్తులలో చెప్పినదంతా అద్వైత సిద్ధాంతమే.**

# 12. బ్రహ్మసత్యం

చరాచర జగత్తులో సత్యము నిత్యము శాశ్వతమైనవాడు పరమేశ్వరుడు ఒక్కడే. అతడు నిన్న ఉన్నాడు. నేడు ఉన్నాడు. రేపు ఉంటాడు. సృష్టికి ముందు జగత్తు అంతా శూన్యంగా ఉన్నది. ఆ శూన్యాన్ని పరమేశ్వరుడు ఆక్రమించి ఉన్నాడు. తరువాత కొంత కాలానికి జగత్తును సృష్టించాలి అనుకున్నాడు. అలా ఎందుకు అనుకున్నాడు? అంటే ప్రళయం జరిగినప్పుడు కర్మక్షయమైన జీవరాశి మోక్షం పొందుతుంది. కాని కర్మక్షయం కాని జీవరాశి తమ కర్మను తమతోపాటు మూట కట్టుకున్నదై పరమేశ్వరునిలో సూక్ష్మరూపంలో దాగి ఉంటుంది. ఇప్పుడు గతంలో కర్మక్షయం కాని జీవరాశికి కూడా కర్మక్షయం చేసి మోక్షాన్ని ప్రసాదించాలనే ఉద్దేశ్యంతోనే మళ్ళీ జగత్తును సృష్టించటం జరిగింది. వికారాలు లేనిది సత్యజ్ఞానానంద మయమైనది, పరిపూర్ణమైనది, సనాతనముగా ఉన్నది, ఏకముగా ఉన్నది, రెండవది లేనిది. అదే పరబ్రహ్మ. నిరాకారమైన పరబ్రహ్మ యందు ఎడారిలో దొంగవాడు లాగా, స్ఫటికంలోని రేఖలులాగా అనిపిస్తూ తెలుపు, ఎరుపు, నలుపు గల సమాన త్రిగుణాలు కలిగి, అనిర్వచనీయమైన మూలప్రకృతి ఉన్నది. ఆ మూలప్రకృతిలో ప్రతిబింబించిన పరబ్రహ్మమే సాక్షిచైతన్యము.

ప్రళయం జరిగినప్పుడు భూమి జలంలోను, జలం అగ్నిలోను, అగ్నివాయువు లోను, వాయువు ఆకాశంలోను ఆకాశం అహంకారంలోను, అహంకారము మహత్తత్త్వము నందు, మహత్తత్త్వము అవ్యక్తమందు లీనమైనాయి. ఆ అవ్యక్తమే మాయ. ఈ రకంగా జగత్తునంతా తనలో లీనం చేసుకున్న మాయ పరమేశ్వరునిలో లీనమయిపోయింది. సృష్టి ప్రారంభానికి ముందున్న పరమేశ్వర స్వరూపం ఇది.

పరమేశ్వరుడు నిరాకారుడు, నిర్గుణుడు. అతడికి రూపభేదం, లింగభేదం లేదు. **దేవీ భాగవతం**లో తారకాసురుని బాధలు పడలేక దేవతలందరూ పరమేశ్వరుని ప్రార్థిస్తారు. అప్పుడు వేయికోట్ల సూర్యుల కాంతితో, వేయికోట్ల చంద్రుల చల్లదనంతో, వేయికోట్ల మెరుపు తీగలు ఒక్కసారి తళుక్కున మెరిసినట్లుగా దివ్యమైన కాంతి

పుంజము వారి ఎదుట ప్రత్యక్షమైంది. దానికి ఆద్యంతాలు లేవు. పైన, క్రింద, ప్రక్కన, మధ్య, అడ్డము ఏవీలేవు. అది చరాచర జగత్తంతా ఆక్రమించి ఉన్నది. అది స్త్రీ కాదు. పురుషుడు కాదు, రెండూ కానిది అంతకన్నా కాదు. అది రూపాతీతము, గుణాతీతము, అయి ఉన్నది. అది పరమేశ్వర స్వరూపము. దివ్యమైన కాంతి పుంజము. ఇది నిరాకారము. జగత్తంతా ఆక్రమించి ఉన్నది. దేవతలంతా ఆ రూపాన్ని చూడలేక "తల్లీ! మాకు తెలిసిన రూపంలో ప్రత్యక్షం కావలసింది" అనిప్రార్థించారు. అప్పుడు ఆమె ఒక స్త్రీమూర్తిగా వారికి సాక్షాత్కరించింది. ఇది సాకారం. ఉపాసకులు సాకారాన్ని తమకు నచ్చిన పేర్లతో రాముడని, కృష్ణుడని, విష్ణువని, నారాయణుడని, శక్తి అని రకరకాలుగా పిలుస్తారు. ఉపాసిస్తారు. ఈ సాకారాన్నే **అపరబ్రహ్మము** అంటారు. నిరాకారం సృష్టి చెయ్యలేదు. సాకారమే సృష్టి చేస్తుంది.

పరమేశ్వరస్వరూపం నుంచి ముందుగా అవ్యక్తం వచ్చింది. అదే మాయ. అవ్యక్తం నుంచి - మహత్తత్త్వం వచ్చింది. ఇది హిరణ్యగర్భుడు. మహత్తత్త్వం నుంచి అహంకారం వచ్చింది. ఇదే విరాడ్రూపము. దీనినుంచే పంచతన్మాత్రలు, పంచభూతాలు, నామరూపాత్మకమైన జగత్తు ఆవిర్భవించాయి. అడవులు, కొండలు, బండలు, పర్వతాలు, నదులు, సముద్రాలు, లోయలతో కూడిన స్థావర జంగమాత్మకమైన జగత్తు, 84 లక్షల రకాలైన జీవరాశి ఏర్పడింది. ఇదంతా పరమేశ్వరస్వరూపమే. చరాచర జగత్తంతా పరమేశ్వర స్వరూపమే. ఇదే విషయం **ఛాందోగ్యోపనిషత్తు**లోని సత్యకామజాబాలి కథలో చెప్పబడింది. అంటే సృష్టి జరిగిన తరువాత పరమేశ్వరుడు స్థావర జంగమాత్మక రూపంలో 84 లక్షల జీవరాశిగా జగత్తంతా ఆవరించి ఉన్నాడు. ప్రళయం జరిగినప్పుడు ఈ సృష్టి అంతా పరమేశ్వరునిలో లీనమై పోతుంది. అప్పుడు మిగిలేది కేవలము పరబ్రహ్మ మాత్రమే. ఈ రకంగా సృష్టికి ముందు, సృష్టి జరిగిన తరువాత, ప్రళయం తరువాత కూడా పరమేశ్వరుడు జగత్తును ఆక్రమించి ఉన్నాడు. అందుకే అతడు నిన్న ఉన్నాడు అంటే - సృష్టికి ముందు ఉన్నాడు. నేడు ఉన్నాడు అంటే - సృష్టి జరిగిన తరువాతున్నాడు. రేపు ఉంటాడు అంటే- ప్రళయం తరువాత కూడా ఉంటాడు.

**నమోస్త్వనంతాయ సహస్రమూర్తయే**
**సహస్ర పాదాక్షి శిరోరు బాహవే**
**సహస్రనామ్నేపురుషాయ శాశ్వతే**
**సహస్రకోటీ యుగధారిణే నమః**

అతడు అనంతుడు అంతము లేనివాడు. పరమేశ్వరుడికి ఆది మధ్యాంతములు లేవు. జన్మ మృత్యుజరాదులు లేవు. కొన్ని వేల రూపాలతో ఉన్నవాడు. ఇక్కడ సహస్రము అంటే వేయి అని అర్థం కాదు. లెక్కలేనన్ని అని అర్థం. జగత్తులోని 84 లక్షల జీవరాశి అతని రూపమే. స్థావరజంగమాలు అన్నీ అతని రూపమే. అతనికి లెక్కలేనన్ని పాదాలు, చేతులు, శిరస్సులు, నేత్రాలు ఉన్నాయి. జీవరాశి అంతా అతని రూపమే అయినప్పుడు ఆ జీవరాసికి ఉన్న కాళ్ళు, చేతులు, శిరస్సులు కూడా అతనివే అవుతాయి కదా. ఈ రకంగా ఉన్నదే విరాడ్రూపము అంటాము. లోకంలో ఉన్న అన్ని నామాలు, అన్ని రూపాలు అతనివే. అతడు శాశ్వతుడు. కొన్ని కోట్ల యుగాల నుంచి ఉన్నవాడు. అందుకే పరమేశ్వరుడు నిత్యము సత్యము శాశ్వతము అయినవాడు. సర్వకాల సర్వావస్థల యందు ఉండేది బ్రహ్మము ఒక్కటే. జగత్తులో నామరూపాత్మకమైనవన్నీ నశించిపోయేవే. అందుకే **బ్రహ్మాసత్యం**.

# 13.జగన్మిధ్య

మిధ్య అంటే భ్రాంతిచేత కల్పించబడినది. అజ్ఞానము చేత కల్పించబడినది అని అర్థం. చరాచర జగత్తులో నామరూపాత్మకమైనవన్నీ అశాశ్వతాలే. అసలు జగత్తే లేదు. బ్రహ్మము ఒక్కటే సత్యము నిత్యము శాశ్వతమైనది. ఈ జగత్తంతా భ్రాంతిచేత, అజ్ఞానము చేత కల్పించబడింది.

అసలు జగత్తు అంటే ఏమిటి?

**జాయతే ఇతి జం** – పుట్టుక కలది కాబట్టి జ అని

**గచ్ఛతీతి గం** – గమనం కలది కాబట్టి గ అని పిలువబడుతున్నది. పుట్టుక, గమనము కలది కాబట్టి దీన్ని జగత్తు అన్నారు.

జగత్తు ఎలా సృష్టించబడింది? అనే విషయం మీద ఇప్పటివరకు వేదము, ఉపనిషత్తులు, దర్శనాలు, పురాణాలలో చెప్పబడిన భిన్నమైన అభిప్రాయాలు చూశాం. ఈ మొత్తాన్ని పరిశీలిస్తే జగత్సృష్టికి ముఖ్యమైన మూడు వాదనలు కనిపిస్తున్నాయి.

**1. ఆరంభవాదము :** దీన్ని చెప్పినవాడు కణాదమహర్షి. ఇది వైశేషిక దర్శనంలోది. జగత్తంతా పరమాణువుల కలయికవల్ల ఏర్పడింది. పరమాణువులు ఒకటిగా కలిస్తే సృష్టి. అవి విడిపోతే ప్రళయము అన్నాడు కణాదుడు. దీనిలో మొదట ఉన్న లక్షణాలు పోకుండానే క్రొత్తవస్తువు ఆవిర్భవిస్తుంది. మట్టితో చేసిన కుండ, నూలుతో తయారైన వస్త్రము ఇలాంటివే.

**2. పరిణామవాదము :** ఇది సాంఖ్యదర్శనానికి సంబంధించినది. దీన్ని చెప్పినవాడు కపిలుడు. ప్రతి వస్తువు ప్రతిక్షణము తన రూపాన్ని మార్చుకుంటూ ఉంటుంది. ఈ మార్పువల్లనే జగత్తు ఏర్పడుతున్నది. ప్రారంభంలో ఉన్న లక్షణాలు పోయి క్రొత్త లక్షణాలు వస్తాయి. పాలుతోడు వేస్తే పెరుగు అవటం ఇలాంటిదే. ఇదే పరిణామము. మార్పు.

**3. వివర్తవాదము :** ఇది వేదాంత దర్శనానికి సంబంధించినది. వేదాంతము అంటే అద్వైతమే. దీన్ని చెప్పినవాడు శంకర భగవత్పాదుల వారు. అసలు జగత్తనేది

లేదు. కేవలము నీ అజ్ఞానంతో, భ్రాంతితో జగత్తు ఉన్నట్లుగా భావిస్తున్నావు అంటాడు శంకరుడు.

ఇప్పుడు ఈ జగత్తు మిథ్య ఎలా అయిందో చూద్దాం. పూర్వకాలంలో ఒక పండితుడు.

**శ్లోకార్థేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిభిః ।**
**బ్రహ్మ సత్యం జగన్మిథ్యా జీవోబ్రహ్మైవ నాపరః ॥**

అనేక గ్రంథాలలో చెప్పిన విషయాన్ని ఒక శ్లోకంలో చెబుతున్నాను. **బ్రహ్మసత్యం జగన్మిథ్య.** జీవుడు బ్రహ్మమే కాని వేరు కాదు. శంకరులవారు ఈ విషయాన్ని **బ్రహ్మజ్ఞానావళీమాల, వేదాంతడిండిమము** అనే గ్రంథాలలో చెప్పారు. మిథ్యాత్వము శాస్త్రాలలో మూడు విధాలుగా చెప్పబడింది.

**1. సదసద్విలక్షణత్వం మిథ్యాత్వం :**

జగత్తు అనిర్వచనీయం కాబట్టి మిథ్య. జగత్తు అనేది సత్తు కాదు. అసత్తు కాదు. జగత్తు లేదు అని చెప్పటానికి లేదు. ఎందుకంటే కళ్ళకు కనిపిస్తున్నది. ఇది కుందేటి కొమ్ము వంటిది కాదు. కంటికి కనిపించినప్పటికి స్వతంత్రసత్త జగత్తుకు లేదు. బ్రహ్మము సత్తకన్న జగత్తుకు వేరే సత్త లేదు. బ్రహ్మముకన్న జగత్తు వేరు కాదు. కాబట్టి బ్రహ్మము కన్న వేరుగా కనిపించే జగత్తంతా మిథ్య.

**2. జ్ఞానైక నివర్త్యత్వం మిథ్యాత్వం :**

జ్ఞానంచేత తిరస్కరించబడుతోంది. కాబట్టి జగత్తు మిథ్య. త్రాడులో భ్రాంతివల్ల కనిపించిన పాము భ్రాంతి పోగానే కనపడదు. అలాగే బ్రహ్మము యొక్క జ్ఞానము కలగగానే ఈ నామరూపాలన్నీ అసత్యము అనే విషయం తెలుస్తుంది. కాబట్టి నామరూపాలతో కూడిన జగత్తంతా మిథ్య.

**3. ప్రతి పన్నోపాధౌత్రైకాలిక నిషేధ ప్రతియోగిత్వం మిథ్యాత్వం :**

ఆద్యంతములందు లేదు కాబట్టి మధ్యలో కూడా లేనట్లే. భ్రాంతివల్ల త్రాడులో పాము కనిపించింది. ఈ పాము భ్రాంతి కలగకముందు లేదు. అలాగే భ్రాంతి

పోయిన తరువాత కూడా లేదు. అలాంటప్పుడు మధ్యలో మాత్రం ఎలా ఉంటుంది? ఉండదు. అందుకే జగత్తు మిధ్య. మరి కంటికి కనిపిస్తున్నది కదా? అంటే ఇది వ్యావహారికసత్త.

ఈ రకంగా వ్యావహారిక జగత్తు లేదు నామరూపాలు గల జగత్తు అంతా మిధ్య.

**విద్యారణ్యుడు** తన **వేదాంతపంచదశి**లోని 13వ ప్రకరణంలోని 68వ శ్లోకంలో

**న వ్యక్తేః పూర్వమస్త్యేవ నపశ్చాచ్చాపి నాశతః ।**
**ఆదావన్తే చ యన్నాస్తి వర్తమానేఽపి తత్తథా ॥**

ఆకాశము అనేది కనిపించటానికి ముందు లేదు. అంటే ఆకాశానికి అవకాశం అనే పేరుగల రూపం లేదు. నాశనమయిన తరువాత ఉండదు. ఈ రకంగా ఆది యందు, అంతమందు లేని వస్తువు మధ్యలోను ఉండదు కదా. భూతభవిష్యత్తులలో లేనిది వర్తమానంలో మాత్రం ఎక్కడనించి వస్తుంది? అందుచేత ఉత్పత్తికి లయానికి మధ్యలో కనిపిస్తున్న అవకాశరూపమైన ఆకాశం మిధ్య అంటాడు.

**భగవద్గీత**లోని 2వ అధ్యాయంలో 28వ శ్లోకంలో

**అవ్యక్తాదీనిభూతాని వ్యక్తమధ్యాని భారత ।**
**అవ్యక్త నిధనాన్యేవేత్యాహ కృష్ణోఽర్జునం ప్రతి ॥**

ఓ అర్జునా ! ఆకాశము మొదలుగా గల భూతాలన్నీ పూర్వం అవ్యక్తమైన దశలో ఉన్నాయి. మధ్యలో వ్యక్తమయినాయి. నాశనమయిన తరువాత మళ్ళీ అవ్యక్తం అయినాయి.

ఇదే రకంగా ఆద్యంతములందు లేని జగత్తు మధ్యలోనూ ఉండదు.

జగత్తు దేశకాల నిమిత్తములు గలది. ఈ మూడింటికన్న వేరైన జగత్తును ఎవరూ భావించటంలేదు. ఈ మూడింటినీ పరిశీలిస్తే నామరూపాత్మక జగత్తు యొక్క ఉనికి యధార్థమో? కాదో? తెలుస్తుంది.

**1. దేశము :**

దేశము అనేది కొన్ని హద్దులకు లోబడి, నిర్ణీతమైన ఆకృతి కలిగి ఉంటుంది. ఏ కారణం చేతనైనా హద్దులు. ఆకారము నశించిపోతే అప్పుడది పూర్వదేశము అని చెప్పటానికి వీలులేదు. అంటే దేశానికి ఇతరాలమీద ఆధారపడకుండా స్వతంత్రమైన సత్త (ఉనికి) లేదు. ఇతరమైన వాటి మీద ఆధారపడేది ఏదీ శాశ్వతమైనది కాదు. దాని ఉనికి కూడా సత్యము కాదు.

**2. కాలము :**

కాలము అనేది రెండు సంఘటనల మధ్య మానవుడి చిత్తంలో కనిపించేది. ఉదాహరణకి సూర్యోదయం, సూర్యాస్తమానం. ఈ రెండింటి మధ్య ఉన్న సమయాన్ని 'పగలు' అంటాం. అలాగే సూర్యాస్తమానం, సూర్యోదయం. ఈ రెండింటి మధ్య ఉన్న సమయాన్ని రాత్రి అంటాం. ఒకవేళ సూర్యోదయం సూర్యాస్తమానం ఈ రెండూ లేకపోతే పగలు రాత్రి అనేవి ఉండవు. కాలము అంటే మనసులో ఆత్మశక్తి ప్రసరించినప్పుడు మనసుకు చింతన కలుగుతుంది. ఆ చింతననుండే కాలభావము ఉదయించింది అని పెద్దలు చెబుతుంటారు. మనసులో కలిగే మార్పును బట్టి కాలం కూడా మారుతూ ఉంటుంది. మానవుడు ఎంతసేపు నిద్రపోయినా, లేచిన తరువాత మాత్రమే గంటసేపు నిద్ర పోయాను. రెండు గంటలు నిద్ర పోయాను అని నిద్ర పోయిన కాలాన్ని తెలుసుకుంటాడు. అంతేకాని నిద్రించిన సమయంలో కాలాన్ని తెలుసుకోలేడు. ఎందుకని అంటే, ఇక్కడ నిద్ర పోయిన సమయంలో నిద్ర పోయాడు అనే ఒక సంఘటనే ఉంది. అంతేకాని రెండవ సంఘటన (నిద్ర లేవటం) లేదు. అందుకే ఇక్కడ చింతన లేదు. కాబట్టి కాలభావము లేదు. కాలభావన చింతనమీద ఆదారపడి ఉంటుంది. చింతనమీద ఆధారపడిన కాలభావనకు స్వతంత్రమైన అస్తిత్వం ఉండదు. అందుచేత కాలము అనేది కూడా అసత్యమే.

**3. నిమిత్తము :**

దీన్నే కార్యకారణ భావము అంటారు. దేశకాలాలు లేకుండా దీనికి ప్రత్యేకమైన ఉనికి లేదు. దేశకాలాలతో నిమిత్తానికి విడదీయలేని బంధమున్నది. ఇది చెట్టుకి

విత్తనానికి ఉన్న సంబంధం వంటిది. విత్తనం నుంచి చెట్టు వస్తోంది. కాబట్టి విత్తనము కారణము చెట్టు కార్యము. మళ్ళీ చెట్టునుండి విత్తనము వస్తోంది. ఇప్పుడు చెట్టు కారణము, విత్తనము కార్యము. జగత్తులో ఏ చిన్న పని అయినా సరే కారణం లేకుండా జరగదు. ఆ కారణం అంతకు ముందున్న కార్యం నుంచి వచ్చినదే. కాబట్టి దీనికి స్వతంత్రమైన అస్తిత్వం లేదు. అందుచేత ఇది కూడా సత్యముకాదు. అయితే దేశకాల నిమిత్తాలు మూడూ ఉన్నాయి అనటానికీ లేదు. లేవని చెప్పటానికీ లేదు. ఒకవేళ ఇవి లేవు అంటే, కంటికి కనిపిస్తున్నాయి. ఉన్నాయి అనుకుంటే వాటికి స్వతంత్రమైన ఉనికిలేదు. ఈ కారణంచేతనే దేశకాల నిమిత్తాలనే మూడు పురులు గలది మాయ. బ్రహ్మము ఒక్కటే సత్యము ఈ జగత్తంతా మిధ్య అంటారు.

జగత్తు మిధ్య అనటానికి అనేక ఉదాహరణలు ఉన్నాయి. వాటిలో ముఖ్యమైనవి చూద్దాం.

**1. స్వప్న జగత్తు (కలలోని ప్రపంచం)**

జగత్తును సృష్టించటానికి ప్రత్యేకంగా బ్రహ్మదేవుడు లేడు. ఈ జగత్తును సృష్టించేది మనస్సు. కలలను సృష్టించినట్లే జగత్తును కూడా మనసే సృష్టిస్తోంది. ఇక్కడ చూడండి. మానవుడు నిద్ర పోతున్నాడు. ఒక కల వచ్చింది. ఆ కలలో తాను ఎక్కడికో ఒంటరిగా పోతున్నాడు. అదేదో ఒక రాజ్యం. అక్కడ అంతా కోలాహలంగా ఉంది. ఏమిటా అని చూడటానికి వెళ్ళాడు. జనం అందరూ బాటకు రెండువైపులా నుంచుని ఉన్నారు. పెద్దగా కేకలు పెడుతున్నారు. అరుస్తున్నారు. మధ్యలో బాటమీద ఒక పెద్ద ఏనుగు చక్కగా అలంకరించబడింది. తుండముతో పూలదండ పట్టుకుని వస్తోంది. తమ దగ్గరకు రాగానే అందరూ తలలు వంచుతున్నారు. ఏం జరుగుతోందో తెలియటం లేదు. ప్రక్కనున్న వారు ఎవరో చెప్పారు. ఆ దేశాన్ని పాలించే రాజుగారు మరణించారు. ఆయనకు సంతానం లేదు. అందుకని ఏనుగుకు పూలమాల ఇచ్చి పంపారు. దాని వెనక మంత్రులు, రాజోద్యోగులు వస్తున్నారు. ఆ ఏనుగు పూలమాల ఎవరి మెడలో వేస్తే, అతడే మహారాజు. ఆ అదృష్టవంతుడు ఎవడో ఇక్కడే ఉన్నాడు. ఏనుగు సరాసరి వచ్చి

పూలమాల తన మెడలో వేసింది. జనం అందరూ చప్పట్లు కొట్టారు. ఆనందంతో గంతులు వేశారు. మీద పూలు జల్లారు. తనను బుజాలమీద ఎత్తుకున్నారు. క్రొత్త రాజుగారు దొరికారు. మంత్రులు, రాజోద్యోగులు పరుగు పరుగున వచ్చారు. ఏనుగు అంబారీ మీద కూర్చోబెట్టారు. జయజయధ్వానాలు చేస్తూ అంతఃపురానికి తీసుకువెళ్ళి మంగళాస్నానాలు చేయించారు. రాజలాంఛనాలు ధరింపచేశారు. పట్టాభిషేకం చేశారు. పొరుగుదేశపు రాజుగారు తన కుమార్తెనిచ్చి వివాహం చేశాడు.

ఇంతలో మెలకువ వచ్చింది. లేచి చూశాడు. సింహాసనం లేదు. రాజ్యం లేదు. రథాలు, గుర్రాలు, ఏనుగులు ఏవీలేవు. అంతా కల. ఇప్పుడు ఈ కల ఎలా వచ్చింది? అంటే తన మనసుచేతనే సృష్టించబడింది. కలలు రెండు కారణాలవల్ల వస్తాయి.

1. తాను భౌతికంగా జాగ్రదావస్థలో చూసిన దృశ్యాలే కలలో కనిపిస్తాయి.
2. తను ఊహించుకునే విషయాలు కలలో కనిపిస్తాయి. ఈ రెండింటికీ కారణం మనస్సే. నిద్ర పోతున్న సమయంలో మనసు ఆ విషయాలను నెమరు వేసుకుంటుంది. అందుకే అవి కలలాగా కనిపిస్తాయి. మెలకువ రాగానే ఆ దృశ్యాలన్నీ మాయమై పోతాయి. ఈ జగత్తు కూడా అలాంటిదే. సృష్టి రెండు రకాలుగా జరుగుతుంది. 1. వ్యష్టి సృష్టి 2. సమష్టి సృష్టి.

**1. వ్యష్టి సృష్టి :** ఇది గారడీవాడు చేసేది. గారడీవాడు సృష్టించిన వస్తువులు అతనికి కాకుండా ఇంకా ఒకరిద్దరికి మాత్రమే కనిపిస్తాయి.

**2. సమష్టి సృష్టి :** ఇది బ్రహ్మదేవుడు చేసే సృష్టి. జగత్తులోని జీవరాసియొక్క సమ్మేళనమే బ్రహ్మదేవుడు. అందరి మనస్సులు ఆయనలో భాగమే. కాబట్టే బ్రహ్మ చేసే సృష్టి అందరికీ ఒకేలాగా కనిపిస్తుంది.

ఇక్కడ గుర్తించాల్సిన విషయం ఏమంటే మనసున్న వాడికి మాత్రమే ఈ జగత్తు జగత్తులాగా కనిపిస్తుంది. మనసులేని పసిపిల్లవాడికి, పిచ్చివాడికి ఈ జగత్తు కనిపించదు. స్వప్నంలాగానే ఈ జగత్తంతా కల్పనామాత్రము. మెలకువ రాగానే కల కరిగిపోయినట్లుగా జ్ఞానం కలగగానే ఈ జగత్తు నశిస్తుంది. ఒకవేళ ఈ

జగత్తు సత్యమైనదే అయితే జ్ఞానం కలిగినా అది నశించదు. భ్రాంతి సిద్ధమైన వస్తువులు జ్ఞానంతో నశించి పోతాయి. జ్ఞానసముపార్జనతో నశించే వస్తువులు అసత్యమైనవి. మెలకువ రాగానే కల కరిగిపోయినట్లుగానే జ్ఞానం కలగగానే నామరూపాత్మకమైన జగత్తు కూడా నశిస్తుంది. అందుకనే కలలాగానే జగత్తు కూడా అసత్యమైనది. జగన్మిథ్య. మనస్సు తన రచనాశక్తితో 84 లక్షల రకాలయిన జీవరాసితో జగత్తును సృష్టించి బ్రహ్మవేత్తలను కూడా అందులో ముంచేస్తుంది. మనసు పనిచేయని సుషుప్తి, మూర్ఛవంటి అవస్థలలో సంసారం కనిపించదు. మనసు ఉన్నచోటే లోకాలున్నాయి. మనసు లేకపోతే లోకాలు లేవు. సృష్టి లేదు. అసలు జగత్తే లేదు. జగన్మిథ్య. ఇది **అవస్థాంతరానుభవము**. స్వప్నజగత్తు ఎలాంటిదో, జాగ్రదావస్థలోని జగత్తు కూడా అంతే.

స్వప్నావస్థకీ, జాగ్రదావస్థకీ తేడా ఉంది. స్వప్నంలో కనిపించిన వస్తువులు మెలకువ రాగానే ఉండవు. కాని జాగ్రదవస్థలో అలా కాదు. పెళ్ళి చేసుకున్నావు. భార్య ఇంటికి వచ్చింది. ఇల్లు కట్టుకున్నావు. గృహప్రవేశం చేశావు. అందమైన వస్తువులు ఇల్లంతా అలంకరించావు. జాగ్రదవస్థలో వస్తువులను తాకుతున్నావు. అనుభవిస్తున్నావు. భార్యతో కాపురం చేస్తున్నావు. పిల్లల్ని కంటున్నావు. సంసార లంపటంలో కూరుకుపోతున్నావు. ఇదంతా అసత్యము అంటే నమ్మటం ఎలా? అనే ప్రశ్న వస్తుంది.

ఇదంతా అసత్యమే. ఎందుకంటే

**మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః**

లోకంలో బంధానికి గాని, మోక్షానికి గాని కారణం మనస్సే. ఈ మనస్సుతోనే వీరు నావారని, పరాయినారని అనుకుంటున్నావు. అందుకే బంధాలు, సంసారము ఏర్పడుతున్నాయి. మనస్సు లేని పిచ్చివాడికి, పసిపిల్లవాడికి ఇవేవీ ఉండవు కదా. అలాగే మూర్ఛావస్థలో సంసారంగాని, బంధాలు గాని లేవు. ఈ బంధాలన్నీ అజ్ఞానంతో కల్పించబడినవి. జ్ఞానజ్యోతులు వెలగగానే అజ్ఞానం పటాపంచలై పోతుంది. యథార్థం గోచరిస్తుంది. జ్ఞానసముపార్జన చెయ్యాలంటే మంచి గురువును

ఆశ్రయించాలి. అప్పుడు తెలుస్తుంది ఈ జగత్తంతా భ్రాంతి, మిధ్య అని. కలకంటున్నప్పుడు అదంతా నిజమే అనుకుంటాం. మేల్కొనగానే అది అసత్యము అనిపిస్తుంది. అలాగే మానవుడు జాగ్రదవస్థ నుంచి కూడా మేల్కొనాలి. అలా మేల్కొనటాన్నే తురీయము, తురీయాతీతము అంటారు. ఇదే సిద్ధావస్థ. ఈ రకంగా సిద్ధావస్థ యందున్న వారికి మాత్రమే జగత్తు కనపడదు. వారికి నామరూపాత్మకమైన జగత్తంతా స్వప్నతుల్యంగా అనిపిస్తుంది.

**2. రజ్జుసర్పభ్రాంతి :** (త్రాడును చూసి పాము అనుకోవటం)

ఒక బాటసారి. దగ్గర ఉన్న పట్నంలో పని ముగించుకుని తనగ్రామానికి బయలుదేరాడు. సాయంత్రం అయింది. ఇంకా కొద్దిసేపట్లో చీకట్లు కమ్ముతాయి. చిట్టడవి గుండా తనగ్రామానికి పోవాలి. అదంతా కొండ ప్రాంతం. ఆ అడవి దరిదాపుల్లో జనసంచారం పెద్దగా ఉండదు. పగటిపూట బాటసారులు వెడుతుంటారు. సాయంత్రం అయ్యేసరికి బాటసారులు కూడా పెద్దగా ఉండరు. ఆ ప్రాంతంలో పాములు ఎక్కువ. అన్నీ భయంకరమైన విషసర్పాలే. కాటు వేసిందంటే క్షణాల్లో ప్రాణాలు గాలిలో కలిసిపోతాయి. చీకటి పడేసరికి అడవిని దాటెయ్యాలి. చకాచకా నడుస్తున్నాడు. సూర్యుడు పడమటి దిక్కుకు చేరుకుంటున్నాడు. క్రమంగా చీకట్లు కమ్ముకుంటున్నాయి. ఇంకా చాలా దూరం పోవాలి. రాత్రిపూట సర్పాలు ఎక్కువగా తిరుగుతాయి. కొండ ప్రాంతంలో సర్పాలకి విషం బాగా ఎక్కువగా ఉంటుంది. ఇంటిదగ్గర భార్యాపిల్లలు ఎదురు చూస్తుంటారు. బయలు దేరేటప్పుడు భార్య మరీమరీ చెప్పింది. త్వరగా పని ముగించుకుని చీకటి పడకముందే అడవి దాటమని. తనూ శతవిధాల ప్రయత్నించాడు. కాని ఆలస్యం అయింది. చీకటి పడుతోంది. త్వరగా అడవి దాటిపోతే బాగుండు. ఈ లోపల ఏ పాము ఎదురవకూడదు. పాము కనిపించిందా ప్రాణాలు పోయినట్లే. భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాడు. ముక్కోటి దేవతలకు నమస్కారాలు చేస్తున్నాడు. భయం వేస్తోంది. భార్య పిల్లలు గుర్తుకు వస్తున్నారు.మొన్ననే ఒక వ్యక్తి ఈ దారిలో పాముకాటుకు గురై మరణించాడు. త్రోవలో ఎవరూ లేరు. తనొక్కడే. గబగబా నడుస్తున్నాడు.

ఇంతలో త్రోవకు అడ్డంగా వంకరలు తిరిగి కనిపించింది. నాలుగు అడుగుల వరకు పొడవుంటుంది. నల్లగా నిగనిగా మెరుస్తోంది. తనకి అతిదగ్గరలో కేవలం పదిఅడుగుల దూరంలోనే ఉంది. పాము మహావేగంగా కదులుతుంది. అయిపోయింది. ఇవాల్టితో తనకు ఆయుష్షు మూడింది. ఇంటిదగ్గర పిల్లలు చిన్నవాళ్ళు. భార్యకు వ్యవహారం పెద్దగా తెలియదు. అందరూ మోసం చేస్తారు. తన భార్యా పిల్లలు రేపటి నుంచి వీధిన పడతారు. భగవంతుడా నీవే దిక్కు. ఎలాగైనా రక్షించు. ఈ గండం నుంచి గట్టెక్కించు. అని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాడు. పాము తనవైపే చూస్తోంది. బుసకొడుతుంది. ఇంకొద్ది నిమిషాలే తన జీవితం. విపరీతమైన భయం వేస్తోంది. శరీరం అంతా వణికిపోతోంది. చెమటలు కారిపోతున్నాయి. భయంతోమాట రావటంలేదు. ఎలాగో నోరు పెగల్చుకుని పాముపాము అని అరిచాడు. భయంతో కేకలు వేశాడు. ఆ బాటలో కొద్ది దూరంలో ఇద్దరు వ్యక్తులు వస్తున్నారు. ఇతని కేకలు విని వారు పరుగెత్తుకుని వచ్చారు. ఏమైంది? అని అడిగారు. నోట్లోంచి మాట రావటం లేదు. కళ్ళ వెంబడి నీరు కారుతోంది. చేత్తో చూపించాడు. గద్గద స్వరంతో అన్నాడు 'పాము' అని. వచ్చిన వాళ్ళు కూడా చూశారు. చాలా పెద్దది. నల్లగా మెరుస్తోంది. పరికించి చూశారు. అది కదలటం లేదు. అందులో ఒకడికి అనుమానం వచ్చింది. 'అది కదులుతున్నట్లు లేదు. చచ్చిపోయిందేమో?' అన్నాడు. నిజమే కావచ్చు. బాటసారి కేకలు వేసినా, తాము పరుగెత్తుకుంటూ వచ్చినా, అది అలాగే ఉంది ఏ మాత్రం చలనం లేకుండా. పోనీ ఒకరాయివేసి చూస్తే. ప్రక్కనే ఉన్న ఒకచిన్న రాయి తీసుకుని దానిమీదికి విసిరాడు. అది కదల్లేదు. బాటసారులకు కొద్దిగా ధైర్యం పెరిగింది. కర్రతో కదిపి చూద్దాం. జాగ్రత్తగా కర్రతో కదిపారు. అయినా పాములో చలనం లేదు. ఇది చచ్చిపోయింది అంటూ కర్రతో ఇవతలకి లాగారు. అప్పుడు తెలిసింది అది పాముకాదు త్రాడు అని. ఎవరో బాటసారి పోతూ పనికిరాని నల్లత్రాడుని అక్కడ పారేశాడు. దాన్ని చూసి పాము అనుకున్నారు. ఇప్పుడు అది పాము కాదని తెలిసింది. ధైర్యంగా ముగ్గురూ వెళ్ళిపోయారు.

ఇప్పుడు చూడండి. ఇంతవరకు అక్కడ పాము కనిపించింది. పడగ విప్పి భయంకరంగా బుసలు కొట్టింది. మరి ఇప్పుడు ఆ పాము ఏమైపోయింది? ఎక్కడికైనా పారిపోయిందా? లేదు. చచ్చిపోయిందా? లేదు. మాయమై పోయిందా? అదీ లేదు. మరి ఇప్పటిదాకా కనిపించిన పాము అకస్మాత్తుగా ఇప్పుడు ఏమై పోయింది? అంటే అక్కడ పామంటూ ఉంటే కదా పారిపోవటానికి, చచ్చిపోవటానికి లేదా మాయమై పోవటానికి అసలక్కడ పామే లేదు. మరి ఇంతవరకు చూసింది? కేవలం భ్రమ. నీ మనసుచేత కల్పించబడిన భ్రమ. గతంలో పాముని గురించి బాగా విని ఉన్నావు. ఇప్పుడు ఇక్కడ ఉన్నది పాము అనుకునే సరికి గతంలో విన్న విషయాలన్నీ నీకు గుర్తుకు వచ్చి కళ్ళముందు సినిమారీలు తిరిగినట్లుగా తిరిగాయి అంతే. అయితే ఇప్పటిదాకా కనిపించిన పాము ఇప్పుడు ఏమై పోయింది? అంటే **– అసత్పదార్థము జ్ఞానం కలగగానే తన అధిష్ఠానంలో లీనమై పోతుంది.** అది పాము కాదుఅని తెలియగానే అసత్యపదార్థమైన పాము తన అధిష్ఠానమైన త్రాడులో కలిసిపోయింది. ఇప్పుడు అక్కడ మిగిలింది అధిష్ఠానమైన త్రాడు మాత్రమే. ఒక పదార్థంలో ఆరోపించబడిన వస్తువు జ్ఞానభావన కలగగానే అధిష్ఠాన పదార్థంలో తప్ప దేనియందు లయమవటంగాని, ఎక్కడికైనా పారిపోవటంగాని, నశించిపోవటం గాని, మాయమైపోవటంగాని జరగదు. అదే రజ్జు సర్పభ్రాంతి. తాడును చూసి పాము అనుకున్నావు. అది నిజంగా పాముకాదు. అజ్ఞానంతో అది పాము అనుకున్నావు. ఇప్పుడు అజ్ఞానం పోయింది. జ్ఞానం కలిగింది. త్రాడులో ఇంతకు ముందు కనిపించిన పాము ఇప్పుడు లేదు. ఏమైంది అంటే తన అధిష్ఠాన రూపంలో నిలిచిపోయింది. విచిత్రం ఏమంటే త్రాడు ఎప్పుడూ త్రాడుగానే ఉంది. అజ్ఞానంతో నువ్వే దాన్ని పాము అనుకున్నావు. అజ్ఞానం పోగానే అది పాము అనే భావన పోయి త్రాడు మాత్రమే మిగిలింది. నీ అజ్ఞానం పోకముందు అక్కడ ఉన్నది త్రాడే. అజ్ఞానం పోయిన తరువాత అక్కడ ఉన్నది త్రాడే. అందులో ఏ మార్పూ లేదు. ఉన్నదంతా నీ భావనలోనే. అలాగే అజ్ఞానము చేత సృష్టించబడిన జగత్తు జ్ఞానంకలగగానే తన అధిష్ఠానమైన బ్రహ్మమునందు చేరిపోతుంది. ఇక జగత్తు లేదు. అందుకే జ్ఞాని దృష్టిలో జగత్తులేదు. జగత్తంతా మిథ్య.

ఇక్కడ ఒక విషయం గుర్తుంచుకోవాలి. అదేమంటే జగత్తు ఎక్కడికీ పోలేదు. అక్కడే ఉంది. జ్ఞానికి మాత్రమే జగత్తు లేదు. అజ్ఞానికి జగత్తు అలానే ఉంది.

**3. స్థాణపురుషుడు :**

చెట్టు మొద్దులో మనిషిని చూడటం.

స్థాణువు అంటే చలనం లేకుండా పడిఉన్న మొద్దు. ఒక పెద్ద చెట్టు. దొడ్డిలో అడ్డంగా ఉంది. దాన్ని కొట్టేశారు. కొమ్మలు రెమ్మలు అన్నీ నరికేశారు. కేవలము కాండము మాత్రమే ఉంది. అదే చెట్టు మొద్దు. దాన్ని అక్కడ పడేసి వెళ్ళిపోయారు. చీకటి పడుతోంది. ఎవరో క్రొత్త వ్యక్తి అటుగా వచ్చాడు. మసకచీకట్లో చెట్టు మొద్దును చూసి దొంగవాడు మాటువేశాడు అనుకున్నాడు. గట్టిగా అరిచాడు. చుట్టుప్రక్కల వాళ్ళు పోగయ్యారు. దీపాలు వెలిగించి చూశారు. అది దొంగవాడు కాదు చెట్టు మొద్దు. జ్ఞానజ్యోతులు వెలగగానే అజ్ఞానం అంతరిస్తుంది. దీపపు కాంతిలో దొంగవాడనే భ్రాంతి పోయింది. అలాగే జ్ఞానం రాగానే అజ్ఞానం చేత సృష్టించబడిన జగత్తు అంతరిస్తుంది. అందుకే **జగన్మిథ్య.**

ఇప్పుడు మనం చెప్పుకున్న వాటిలో 2,3 ఉదాహరణలు మసకచీకటి యందు భ్రాంతిచేత కనిపించినవి. బాటసారి మసకచీకట్లో త్రాడును చూసి పాము అనుకున్నాడు. చెట్టు మొద్దును చూసి దొంగ అనుకున్నాడు. ఇక్కడ త్రాడు పాము ఇవి ఒకటి కావు. అలాగే చెట్టు మొద్దు దొంగ ఒకటికావు. కాని అక్కడ ఆ రెండూ వేరు కాదు. త్రాడే పాముగా, చెట్టుమొద్దు దొంగవాడుగా అనిపించింది. అలాగే బ్రహ్మము జగత్తు వేరుకాదు. కాని రెండూ ఒకటే కావు.

ఇక నుంచి జాగ్రదవస్థలో భ్రాంతివల్ల కలిగిన సంఘటనలు చూడండి. వీటిలో మొదటిది.

**4. మృగతృష్ణలో నీరు :**

మృగతృష్ణ అంటే ఎండమావి. ఎడారిలో ప్రయాణం చేస్తున్నాడు. మధ్యాహ్నం 12 గం॥ దాటింది. పైన సూర్యుడు వేడిగా ఉన్నాడు. ఆ వేడికి నేలమీదఉన్న ఇసక వేడెక్కింది. చుట్టుప్రక్కల ఎక్కడా నీరనేది లేదు. దాంతో గాలికూడా వేడిగా

ఉంది. సూర్యరశ్మి ఇసకమీద ప్రతిబింబిస్తోంది. బాటసారికి దాహం వేస్తోంది. ఎక్కడైనా నీరు దొరికితే బాగుండు అనుకుంటున్నాడు. అతనికి ఎడారిలో ప్రయాణం క్రొత్త, నీరు ఎక్కడ ఉంటుందో తెలియదు. అలా వెడుతున్నాడు. ఇంకలో దూరంగా నీటిగుంట కనిపించింది. అతడికి ప్రాణం లేచి వచ్చింది. అటువైపుగా బయలుదేరాడు. వడివడిగా నడుస్తున్నాడు. ఇంకొద్ది దూరం నడిస్తే నీటిగుంట దగ్గరకు చేరతాడు. అలా నడుస్తున్నాడు. ఎండ మండిపోతుంది. అడుగున ఇసక కాలిపోతోంది. దాహం విపరీతంగా అవుతోంది. నడక వేగం పెంచాడు. దగ్గర దగ్గరగా సొమ్మసిల్లి పోయే స్థితి వచ్చింది. లేని వోపిక తెచ్చుకుని నడుస్తున్నాడు. ఇంతలో ఎడారితో బాగా పరిచయం ఉన్న వ్యక్తి వచ్చాడు. ఇతడి పరిస్థితి గమనించి చెప్పాడు. "అది నీటి గుంట కాదు. ఎండమావి. ఎడారిలో మధ్యాహ్న సమయంలో బాగా ఎండగా ఉన్నప్పుడు, ఆ ఎండ ఇసకమీదపడి అక్కడ నీరున్నట్లుగా అనిపిస్తుంది. క్రొత్తవారు అది నిజంగానే నీటిగుంట అనుకుని దానికోసం పరుగులు పెడతారు. విచిత్రం ఏమంటే నువ్వు ఎంత వేగంగా ముందుకు వెడితే, అది అంత వేగంగా వెనక్కి వెడుతుంది. మీ ఇద్దరి మధ్య దూరం ఇలాగే ఉంటుంది. తెలియని వారు ప్రాణాలు కోల్పేయే ప్రమాదం కూడా ఉంది." అని చెప్పి దిశానిర్దేశం చేశాడు. ఇప్పుడు బాటసారికి తెలిసింది అది నీటిగుంట కాదు ఎండమావి అని.

మరి ఇప్పటిదాకా కనిపించిన నీటిగుంట ఏమైంది? అదెక్కడికీ పారిపోలేదు. మాయమై పోలేదు. అది నీటిగుంట అనే అజ్ఞానం నశించగానే తన అధిష్ఠానమైన సూర్యరశ్మిలో కలిసిపోయింది. అలాగే అజ్ఞానం నశించగానే జగత్తు కూడా తన అధిష్ఠానమైన బ్రహ్మమునందు లీనమై పోతుంది. అందుకే **జగత్తు మిధ్య.**

**5. శుక్తిరజతము :**

ముత్యపు చిప్పనుచూసి వెండి అనుకోవటం. సముద్రంలో ముత్యపు చిప్పలోని ముత్యాలను తీసుకుని వ్యాపారులు ఖాళీ చిప్పలను వదిలేస్తారు. చిప్ప లోపలిభాగము తెల్లగా వెండిరంగులోను, బయటభాగము నల్లరంగులోను ఉంటుంది. ఖాళీ చిప్ప సముద్రపు నీటి మీద తేలియాడుతుంటుంది. దానిమీద సూర్యకాంతి

ప్రసరించినప్పుడు అది వెండిలాగా తళతళా మెరుస్తుంది. దూరం నుంచి చూసేవారికి వెండిగిన్నె అనిపిస్తుంది. ఈ విషయం తెలియనివారు నిజంగానే అది వెండిగిన్నె అనుకుంటారు. ఒకసారి దాని దగ్గరకు వెళ్ళి చూసిన వారికి తెలుస్తుంది అది వెండిగిన్నె కాదు ముత్యపుచిప్ప అని. దాన్ని వెండి గిన్నెగా భావించటం అజ్ఞానం వలన కలిగిన భ్రాంతి. అజ్ఞానం పోగానే అది వెండిగిన్నె అనే భ్రాంతి కూడా పోతుంది. ఇప్పటివరకు కనిపించిన వెండి గిన్నె తన అధిష్ఠానమైన ముత్యపుచిప్పలో లీనమై పోతుంది. అలాగే అజ్ఞానము నశించగానే జగత్తు తన అధిష్ఠానమైన బ్రహ్మమునందు లీనమై పోతుంది. అందుకే జగత్తు మిథ్య.

**6. ఇంద్రజాలము :**

ఇది గారడీవిద్య. గారడీవాడు సృష్టించే వస్తువులన్నీ అసత్యాలే. మనల్ని భ్రమింప చేసేవే.

పూర్వకాలంలో భోజమహారాజు ఆస్థానంలో సభ తీర్చి ఉండగా ఒక వ్యక్తి వచ్చి "రాజా! నేను ఇంద్రజాలికుణ్ణి. ప్రదర్శన ఇస్తాను. నా ఇంద్రజాలాన్ని మీరు తిలకించండి" అన్నాడు. ఆ మాటలు విన్న భోజరాజ 'నేను ఇప్పుడు పనివత్తిడిలో ఉన్నాను. తీరుబడి ఉన్నప్పుడు నీ ఇంద్రజాలాన్ని తిలకిస్తాను' అన్నాడు. సరేనని వెళ్ళిపోయాడు ఇంద్రజాలికుడు. ఆ తరువాత ఒక బ్రాహ్మణుడు వచ్చాడు. అతనితో పాటుగా యుక్తవయస్కురాలైన కుమార్తెకూడా ఉంది. వచ్చిన వ్యక్తి 'రాజు నేను నా భార్యతోసహా తీర్థయాత్రలకు వెడుతున్నాను. ఇక్కడ నాకు ఎవరూలేరు. అందుకని నేను వచ్చేదాకా నా కుమార్తెను మీ అంతఃపురంలో జాగ్రత్తగా ఉంచండి. తిరిగి వచ్చిన తరువాత మంచివరుణ్ణి చూసి వివాహం చేస్తాను.' అన్నాడు. సరే అన్నాడు మహారాజు. బ్రాహ్మణుని కుమార్తెను అంతఃపురానికి తరలించారు పరిచారికలు. బ్రాహ్మణుడు వెళ్లిపోయాడు. రాజుగారు కూడా సభ చాలించాడు.

కాలం గడుస్తోంది. ఒకరోజు రాజుగారు అంతఃపురంలో విహరిస్తుండగా యవ్వనవతి అయిన ఒక స్త్రీ కనిపించింది. ఆమె చాలా అందంగా ఉంది. తనకు తెలియకుండా వచ్చిన ఈ స్త్రీ ఎవరు? అని అడిగాడు రాజు. 'మహారాజా ఒకరోజున

ఒక బ్రాహ్మణుడు వచ్చి, తాను తీర్థయాత్రలకు వెడుతున్నానని చెప్పి తన కుమార్తెను అంతఃపురంలోఉంచమన్నాడు కదా. ఆ బ్రాహ్మణ బాలికే ఈ స్త్రీ' అన్నారు పరిచారికలు. పరికించి చూశాడు రాజు.ఆ రోజున సరిగా చూడలేదు. ఈ బాలిక చాలా అందగత్తె. వెంటనే రాజు ఆమె దగ్గరకు వెళ్ళి తనను పరిచయం చేసుకున్నాడు. తనను వివాహం చేసుకోమని అర్థించాడు. సరేనన్నది బ్రాహ్మణ బాలిక. వారికి వివాహమైంది. రాజుగారు ఆ బ్రాహ్మణ స్త్రీతో సుఖంగా ఉన్నాడు. సంవత్సరాలు గడిచినాయి. ఆమెకు నలుగురు మగపిల్లలు కలిగారు. వారు అన్ని విద్యలలోను ఆరితేరారు. యుద్ధవిద్యలో తండ్రిని మించిపోయారు.

ఒక రోజున రాజుగారు సభ తీర్చి ఉన్నారు. సభకు రాణికూడా వచ్చింది. సభలోకి ఒక వ్యక్తి ప్రవేశించాడు. తాను ఇంద్రుని రథసారథి 'మాతలి'ని అని పరిచయం చేసుకొని 'రాజా! దేవదానవ సంగ్రామం చాలా భీకరంగా జరుగుతున్నది. దానవులను ఓడించటం దేవతలకు కష్టంగా ఉంది. అందుచేత దేవతలకు సహాయంగా రావాలని మీకు ఇంద్రుడు వర్తమానం పంపాడు' అన్నాడు. మహారాజు ఒక్క నిమిషం ఆలోచించి 'నాకు ఇక్కడ పనులు ఎక్కువగా ఉన్నాయి. కాబట్టి నేను రాలేను. నాకన్ని మహావీరులు నా కుమారులు. వాళ్ళు నలుగురినీ దేవతలకు సాయంగా పంపుతాను.' అన్నాడు. రాకుమారులను వెంట పెట్టుకుని దేవలోకానికి వెళ్ళాడు దేవదూత.

ఆకాశంలో దేవదానవ సంగ్రామం ఘోరంగా జరుగుతోంది. దేవతలవి రాక్షసులవి శరీర భాగాలు తెగి నేలమీద పడుతున్నాయి. ఇంతలో ఒక చెయ్యితెగి సభాస్థలిలో పడింది. ఆశ్చర్యంగా చూశారు సభాసదులు ఆ చేతిని ఎక్కడో చూసినట్లుంది. గుర్తించటానికి ప్రయత్నం చేస్తున్నారు. ఆ సమయంలో రాణి గుర్తించింది. అది తన కుమారుడిది. కుమారుడికి ప్రమాదం వాటిల్లింది. రాణికి దుఃఖం ముంచుకు వస్తోంది. ఇంతలో రాకుమారుడి శిరస్సు కూడా నేలమీద పడింది. చూస్తుండగానే నలుగురు రాకుమారుల తలలు తెగిపడ్డాయి. ఈ హఠాత్పరిణామానికి తల్లడిల్లిపోయింది మహారాణి. విపరీతంగా దుఃఖించింది. స్పృహ కోల్పోయింది. వైద్యులు పరీక్షించారు. కాని అప్పటికే పుత్రశోకంతో ఆవిడ

మరణించింది. విచారిస్తున్నాడు మహారాజు. ఈ రాణి బ్రాహ్మణకుమార్తె. తాను తిరిగి వచ్చేదాకా జాగ్రత్తగా కాపాడమని తనకుమార్తెను ఇక్కడ వదలివెళ్ళాడు బ్రాహ్మణుడు. ఇప్పుడు అతడు తిరిగి వచ్చి కుమార్తెను ఒప్పగించమంటే ఏం చెయ్యాలి? నా కుమార్తె ఏది? అని అడిగితే ఏం సమాధానం చెప్పాలి? ఏమీ పాలుపోవటం లేదు. ఇంతలో సభలోకి వచ్చాడు బ్రాహ్మణుడు. 'రాజా! నా తీర్థయాత్ర పూర్తయింది. నా కుమార్తెను పంపించు. తగినవరుణ్ణిచూసి పెళ్ళిచేస్తాను.' అన్నాడు. ఆ మాటలు విన్న మహారాజుకు ఏం చెయ్యాలో? ఏం చెప్పాలో? తెలియలేదు. వెంటనే సింహాసనం మించి దిగి బ్రాహ్మణుడి కాళ్ళు పట్టుకుని విపరీతంగా దుః ఖిస్తున్నాడు.

'రాజా! ఏమిటిది. లే' అన్న మాటలు వినిపించాయి. నెమ్మదిగా తలెత్తి చూశాడు. ఎదురుగా నుంచుని ఉన్నాడు ఇంద్రజాలికుడు. రాజుగారు అతడి కాళ్ళమీద పడి ఏడుస్తున్నాడు. సభాసదులంతా విస్తుపోయి చూస్తున్నారు. అంటే ఇంతవరకు తను చూసిందంతా ఇంద్రజాలమన్న మాట. అనుకున్నాడు మహారాజు. ఇంద్రజాలికుణ్ణి సత్కరించి పంపేశాడు.

ఇక్కడ చూడండి. ఇప్పటిదాకా అంతా జరిగింది అని భావించాడు మహారాజు. జ్ఞానం కలిగే సరికి అది భ్రాంతి. ఇంద్రజాలము అని తెలిసింది. అలాగే జ్ఞానం కలగగానే నామరూపాత్మకమైన జగత్తంతా పరబ్రహ్మలో లీనమై పోతుంది. **అందుకే జగత్తు మిథ్య.**

**7. ఆకాశంలో నీలత్వం :**

ఆకాశం నీలంగా ఉండదు. ఆకాశం గగనం శూన్యం. శూన్యప్రదేశమే ఆకాశము. అవకాశాన్నిచ్చేదే ఆకాశము. మనచుట్టూ ఉన్నదంతా ఆకాశమే. అందుకే మనం అటుఇటు కదలగలుగుతున్నాం. పైన అంతా శూన్యమే. అదే ఆకాశం. లోతైన ప్రదేశాలు నీలంగా కనిపిస్తాయి. పసిఫిక్ మహాసముద్రం నీలంగా కనిపిస్తుంది. అక్కడి నీరు నీలంగా ఉండదు. లోతెక్కువ. అందుచేతనే అది నీలంగా కనిపిస్తుంది అంటారు శాస్త్రజ్ఞులు. ఆకాశం నీలిరంగులో లేకపోయినప్పటికీ అది నీలంగా

ఉన్నదనుకోవటం భ్రాంతి. జ్ఞానంవల్ల ఈ భ్రాంతి తొలగిపోతుంది. అలాగే జగత్తు కూడా. అందుకే జగత్తు మిథ్య.

నాలుగు నుంచి ఏడువరకు చెప్పిన ఉదాహరణలన్నీ జాగ్రదావస్థలో భ్రాంతి వల్ల కలుగుతున్నాయి. ఇది జాగ్రదావస్థలో కలిగిన అధ్యాస.

**8. జపాకుసుమ సాన్నిధ్యమున స్ఫటికము :**

జపాకుసుమము అంటే మందారపువ్వు. ఎర్రని మందారం. స్ఫటికము తెల్లగా ఉంటుంది. స్వచ్ఛంగా ఉంటుంది. దానిలో ఏ రకమైన మాలిన్యము ఉండదు. దానిదగ్గర ఏ రంగు ఉంటే, ఆ రంగు స్ఫటికంలో ప్రతిబింబిస్తుంది. స్ఫటికం దగ్గర ఎర్రని మందారపువ్వు ఉంచాం. ఇప్పుడు తెల్లగా, స్వచ్ఛంగా ఉండే స్ఫటికం కాస్తా ఎర్రగా కనిపిస్తుంది. నిజానికి స్ఫటికం ఎర్రగా లేదు.కాని మందారపువ్వు యొక్క ఎరుపువల్ల స్ఫటికం కూడా ఎర్రగా అనిపిస్తుంది. ఇది భ్రాంతి. అధ్యాస. మందారపువ్వుని గనక అక్కడి నుంచి తీసేస్తే స్ఫటికం యథాప్రకారం స్వచ్ఛంగానే కనిపిస్తుంది. అలాగే అజ్ఞానం లేకపోతే జగత్తు ఉండదు. జగత్తు మిథ్య.

**9. దర్పణంలో ప్రతిబింబం :**

దర్పణం అంటే అద్దం. అద్దానికి ఎదురుగా ఉన్న బింబం అద్దంలో ప్రతిబింబిస్తుంది. ఈ ప్రతిబింబం నిజంకాదు. అద్దం లేకపోతే ప్రతిబింబం ఉండదు. ఈ విషయాన్ని శంకర భగవత్పాదుల వారు తమ **దక్షిణామూర్తి స్తోత్రం**లోని మొదటి శ్లోకంలో వివరించారు.

**విశ్వం దర్పణ దృశ్యమాన నగరీ తుల్యం నిజాంతర్గతం**
**పశ్యన్నాత్మని మాయయా బహిరివో ద్భూతం యథా నిద్రయా ।**
**యస్సాక్షాత్కురుతే ప్రబోధసమయే స్వాత్మానమే వాఽ_ద్వయం**
**తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥ 1**

కలలో మనయందే అంటే మన మనస్సునందే కనిపించేదంతా నిద్రవల్ల ఎక్కడో జరుగుతున్నది అనుకుంటాము. అలాగే అద్దంలో కనిపించే ప్రతిబింబం లాగా

మన ఆత్మయందే కనిపించే ఈ ప్రపంచాన్ని మాయ, అజ్ఞానము కారణంగా ఎక్కడో బయట ఉన్నదానిలాగా చూస్తాము. ఆ మాయ గనక విడిపోతే ప్రపంచమంతా మనయందే ఉన్నదని తెలుసుకుంటాము. ఈ విధంగా తనకన్న వేరైన వస్తువు ఏదీ లేదని తెలియజెప్పే గురువు దక్షిణామూర్తికి నమస్కారము.

అవస్థలు మూడు. జాగ్రదవస్థ, స్వప్నావస్థ. సుషుప్తి. వీటినే అవస్థాత్రయము అంటారు. వీటిలో స్వప్నావస్థ అంటే నిద్రలో కలలు గనే స్థితి. ఈ స్థితిలో జీవుడు కంఠస్థానంలో ఉంటాడు. జాగ్రదావస్థలోని పురుషుని అనుభవాలే కలలో సాక్షాత్కరిస్తాయి. జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, అంతఃకరణచతుష్టయముతో కంఠస్థానానికి వచ్చినప్పుడు జీవుడుకనేది కల. జాగ్రదావస్థలో అనుభవించిన విషయాలు జ్ఞాపకానికి రావటమే స్వప్నము. ఈ స్థితిలో మనస్సు చిత్రవిచిత్రాలైన కల్పనలు చేస్తుంది. రాజులు, రథాలు, రాజ్యాలు, ఏనుగులు, గుర్రాలు, సైనికులు, యుద్ధాలు, జయాపజయాలు వీటన్నింటినీ ఊహించుకుంటుంది. తానే రాజైనట్లు భావిస్తుంది. మహదానందాన్ని అనుభవిస్తుంది. ఒక్కొక్కసారి కష్టాలు కలిగినట్లుగా భావించి దుఃఖిస్తుంది. భయపడుతుంది. ఏడుస్తుంది. ఈ రకంగా స్వప్నంలో సుఖాలు, దుఃఖాలు అన్నీ అనుభవిస్తుంది. జాగ్రదావస్థలో లాగానే స్వప్నావస్థలో కూడా రాగద్వేషాలు, కామక్రోధాలు, దర్పము, మాత్సర్యము, అహంకారము, సుఖము, దుఃఖము, ఈర్ష్య, అసూయ అన్నీ ఉంటాయి. మెలకువ వచ్చిన తరువాత స్వప్నంలో కనిపించిన దృశ్యాలన్నీ ఎక్కడో జరిగినట్లుగా అనుకుంటాము. నిజానికి ఆ దృశ్యాలు, సంఘటనలు ఎక్కడో కాదు మన మనస్సునందే జరుగుతున్నాయి. మనస్సుచేత కల్పించబడుతున్నాయి. స్వప్నము మనస్సుచేత కల్పించబడిన అవస్థ. కాని మనం నిద్రలో ఉండటం వల్ల దీన్ని గుర్తించలేక ఎక్కడో ఈ విషయాలు, సంఘటనలు జరుగుతున్నాయి అని భావిస్తాము. మనం కూడా అక్కడికి వెళ్ళాం అనుకుంటాం. కాని అదేదీ నిజంకాదు. మనం ఎక్కడికీ వెళ్ళలేదు. ఆ దృశ్యాలు, సంఘటనలు మన మనస్సునందే జరుగుతున్నాయి.

ఈ శ్లోకంలో అద్దము బ్రహ్మముతోను, అద్దంలో ప్రతిబింబించిన నగరము జగత్తుతోను పోల్చబడినాయి. అద్దంకన్న ప్రతిబింబము వేరుగా లేదు. కాని అద్దము,

ప్రతిబింబము ఒకటి కావు. అద్దం లేకపోతే ప్రతిబింబము ఉండదు అలాగే అజ్ఞానము లేకపోతే జగత్తు ఉండదు. **అందుకే జగత్తు మిథ్య.**

### 10. పడవ ప్రయాణం

పడవలో ప్రయాణం చేసేవాడికి వడ్డున ఉన్న చెట్లు, వృక్షాలు అన్నీ కదిలిపోతున్నట్లుగా అనిపిస్తుంది. అదే విధంగా బస్సులోను, రైల్లోను ప్రయాణించే వారికి ప్రక్కన ఉన్న పట్టణాలు, నగరాలు అన్నీ కదలిపోతున్నట్లుగా అనిపిస్తుంది. ఇదంతా భ్రాంతి అలాగే ఈ జగత్తు కూడా భ్రాంతి.

### 11. నీటిలో వృక్షాలు :

నిశ్చలంగా ఉన్న నీటిలో చూసినప్పుడు వడ్డున ఉన్న వృక్షాలన్నీ ఆ నీటిలో తలక్రిందులుగా కనిపిస్తాయి. నిజానికి వృక్షం తలక్రిందులుగా ఉండదు. అవి అలా ఉన్నాయనుకోవటం అంతా భ్రమ. ఇదే రకంగా జగత్తు కూడా.

ఇప్పుడు 8 నుంచి 11 వరకు గల ఉదాహరణలన్నీ జాగ్రదావస్థలో విచారలోపం వల్ల, అంటే వాటిని గురించి సరిగా ఆలోచించకపోవటంవల్ల భ్రాంతి సంభవిస్తోంది. జగత్తు కూడా ఇంతే.

తరువాత చెప్పే ఉదాహరణలు కొంచెం తేడాగా ఉంటాయి.

### 12. నూలు-వస్త్రము :

దారపు పోగులన్నీ కలిసి వస్త్రంగా ఏర్పడతాయి. కాని దారం వేరు వస్త్రం వేరు. వాటి లక్షణాలు వేరు. నామరూపాలు కూడా వేరు. కాని నూలుకన్న వస్త్రం వేరు కాదు. అలాగే బ్రహ్మమే జగత్తుగా నామరూపాలతో కనిపిస్తోంది. బ్రహ్మము కన్న జగత్తు వేరుకాదు. అంతేకాని జగత్తుకు స్వతంత్ర సత్తలేదు. జగత్తు మిథ్య.

### 13. మట్టి-కుండ :

కుమ్మరివాడు మట్టిని బాగా త్రొక్కి దాంతో వివిధ రకాలయిన పాత్రలు తయారు చేస్తాడు. వాటికి కుండ, చట్టి, బాన, మూకుడు అంటూ నామకరణం చేస్తాడు. వీటన్నింటిలో ఉండేది మట్టి. అయినప్పటికీ మట్టి లక్షణాలు వేరు. కుండవంటి

పాత్రల లక్షణాలు వేరు. మట్టికన్న ఈ పాత్రలు వేరు కాదు. కుండ పగిలిపోతే మళ్ళీ మట్టిలో కలిసిపోతుంది. అలాగే బ్రహ్మము, జగత్తు వేరు కాదు. అజ్ఞానం పోగానే జగత్తు తన అధిష్ఠానమైన బ్రహ్మము నందు లీనమై పోతుంది. జగత్తుకు స్వతంత్ర ప్రతిపత్తిలేదు అందుకే జగత్తు మిథ్య.

**14. బంగారు ఆభరణాలు :**

కంసాలివాడు బంగారాన్ని కరిగించి రకరకాల ఆభరణాలు తయారుచేస్తాడు. ఆభరణాల పేరేదైనా, ఆకారం ఏదైనా అందులో ఉండేది బంగారమే. బంగారు కంకణం అన్నప్పుడు, బంగారమే వలయాకారంలో తయారు చెయ్యబడింది. మళ్ళీ దాన్ని కరిగిస్తే వచ్చేది బంగారమే. అలాగే బ్రహ్మము జగత్తు వేరు కాదు. నీ అజ్ఞానంతో ఈ నామ రూపాత్మకమైన జగత్తు సత్యము అనుకుంటున్నావు. అజ్ఞానం పోగానే నామరూపాత్మకమైన జగత్తు తన అధిష్ఠానమైన బ్రహ్మము నందు లీనమై పోతుంది. అందుకే **జగత్తు మిథ్య.**

పూర్వకాలంలో 'పుణ్యానందుడు' అనే ముని తన ఆశ్రమంలో తపస్సు చేసుకుంటున్నాడు. ఆ సమయంలో ఆకాశమార్గాన రెండు హంసలు ఆశ్రమం మీదగా వెడుతున్నాయి. అదులో ఆడుహంస మగహంసతో 'నాథా! లోకంలో దేన్ని గురించి తెలుసుకుంటే అన్ని విషయాలు తెలుస్తాయో, ఆ విషయాన్ని వివరించండి" అంది. ఆ మాటలు వినన మగహంస" కుమ్మరివాడు మట్టిని తెచ్చి, నీటితో కలిపి, బాగా త్రొక్కి దాంతో కుండలు మొదలైన పాత్రలు తయారుచేస్తాడు. పాత్రల పేరు ఏదైనా, రూపు ఏదైనా వాటిలో ఉన్నది మట్టే. అలాగే కంసాలివాడు బంగారాన్ని కరిగించి వివిధ రకాలైన ఆభరణాలు తయారుచేస్తాడు. ఆభరణాల నామరూపాలు వేరైనా వాటిలో ఉన్నది బంగారమే "అంది. ఆ మాటలు విన్న ఆడుహంస" తెలిసింది. చరాచర జగత్తంతా పరబ్రహ్మ స్వరూపమే. కాబట్టి బ్రహ్మమును గురించి తెలుసుకుంటే లోకంలో అన్ని విషయాలు తెలుస్తాయి అంది. ఇలా మాట్లాడుకుంటూ హంసలు ఆశ్రమ ప్రాంగణం దాటి వెళ్ళిపోయాయి. ఆ మాటలు విన్న పుణ్యానందుడు 'ఆ హంసలు శివశక్తులని, పరబ్రహ్మతత్త్వాన్ని గురించి తనకు చెప్పటానికే వారు ఇలా

వచ్చారని భావించి శ్రీవిద్యాపరమైన **కామకలావిలాసము** అనే గ్రంథాన్ని వ్రాశాడు. దానికి నేను తెలుగులో వ్రాసిన వ్యాఖ్యయే **శ్రీవిద్యాసర్వస్వము.**

**15. లోహవిగ్రహాలు :**

సామాన్యంగా వెండి, రాగి, ఇత్తడి మొదలైన లోహాలతో దేవతా విగ్రహాలు తయారుచేస్తారు. విగ్రహం ఏదైనా అందులో ఉండేదంతా లోహమే. విగ్రహాన్ని కరిగిస్తే మళ్ళీ లోహమే అవుతుంది. అలాగే బ్రహ్మమే నీ అజ్ఞానంచేత జగత్తుగా కనిపిస్తోంది. అజ్ఞానం పోగానే జగత్తు తన అధిష్ఠానమైన బ్రహ్మములో లీనమై పోతుంది. జగత్తుకు స్వతంత్ర సత్తలేదు. అందుకే జగత్తు మిథ్య.

**16. ఫేనబుద్బుదతరంగాలు :**

ఫేనము అంటే నురగ, బుద్బుదము అంటే – బుడగ, తరంగము అంటే – అల. సముద్రంలో గాలికి నీరంతా అలలుగా వస్తుంది. ఆ సమయంలో సముద్రపు నీరు నురగగాను, బుడగలు గాను కనిపిస్తుంది. నిజానికి ఇవేవీ వేరుకావు. నురగ, బుడగ, అల అంతా నీరే. కొద్దిసేపటికి ఇవి మళ్ళీ నీరుగా మారిపోతాయి. అలాగే బ్రహ్మమే నామరూపాత్మకమైన జగత్తుగా పరిణమించింది. దీనికి కారణము నీ అజ్ఞానము. ఆ అజ్ఞానము నశించగానే జగత్తు తన అధిష్ఠానమైన బ్రహ్మము నందు లీనమై పోతుంది. అందుకే **జగత్తు మిథ్య** ఇది భ్రాంతినాదము. **నామరూపాత్మకమైన జగత్తంతా మిథ్య.**

జ్ఞానంచేత నశించిపోతుంది కాబట్టి ఈ జగత్తు అంతా మిథ్య. అయతే ఈ జగత్తు నశించేది కాదు. అది ఎప్పటికీ నశించదు. జగత్తు అలానే ఉంటుంది. మరి తురీయావస్థలోను, సమాధి స్థితిలోను జగత్తు కనిపించదు కదా? నిజమే ఆ స్థితిలో జగత్తు కనిపించదు. అంత మాత్రంచేత జగత్తు నశించిందని కాదు. మహర్షి తపోనిష్ఠలో సమాధి స్థితిలో ఉన్నాడు. అతడికి నామరూపాత్మకమైన జగత్తు కనిపించదు. కాని సమాధి నుంచి లేచిన తరువాత ఈ జగత్తంతా ఇలాగే కనిపిస్తుంది. ఇంకా బాగా అర్థం కావాలంటే ఒక చిన్న ఉదాహరణ చూడండి. ఏదో ఉత్సవము,

లేదా ఊరేగింపు జరుగుతోంది. దుందుభులు, భేరీభాంకారాలు, వివిధ రకాలైన మేళతాళాలు వినిపిస్తున్నాయి. ఆ ఊరేగింపు మన దగ్గరగా పోతోంది. ఆ శబ్దంలో మిగిలిన శబ్దాలు ఏవీ వినపడవు. కొంతసేపటికి ఊరేగింపు మనల్ని దాటి వెళ్ళిపోయింది. దుందుభులు, మేళతాళాల శబ్దం తగ్గిపోయింది. ఇప్పుడు మిగిలిన శబ్దాలు వినిపిస్తాయి. అలాగే సమాధిలో ఉన్నవాడికి జగత్తు కనిపించదు. సమాధి నుంచి లేవగానే జగత్తు యథాతథంగా దర్శనమిస్తుంది.

కాబట్టి ఇక్కడ గుర్తించాల్సిన విషయం ఏమంటే జ్ఞానిదృష్టిలో మాత్రమే జగత్తు ఉండదు. అజ్ఞాని దృష్టిలో నామరూపాత్మకమైన జగత్తు యథాతథంగా ఉంటుంది.

ఇక్కడ చాలా జాగ్రత్తగా చూడండి 1 నుండి 11 వరకు ఉన్న ఉదాహరణలకు 12 నుంచి 16 వరకు ఉన్న ఉదాహరణలకు తేడా ఉంది. మొదటి 11 ఉదాహరణలు అజ్ఞానంతో పరబ్రహ్మను గురించి తెలుసుకోలేక, నామరూపాత్మకమైన జగత్తే సత్యము అనుకునే వారికోసం చెప్పబడ్డాయి. 12 నుంచి 16 వరకు ఉన్న ఉదాహరణలు అజ్ఞానం నశించి బ్రహ్మమును, బ్రహ్మము యొక్క ఛాయామాత్రంగా వ్యావహారిక జగత్తును చూసేవారికి చెప్పబడ్డాయి. బంగారు కంకణాన్ని చూసి 'ఇది బంగారమే' అనుకోవటానికి, ముత్యపుచిప్పను చూసి వెండి అనుకోవటానికి తేడా ఉంది. కంకణంలో బంగారం ఉంది. కాని ముత్యపుచిప్పలో వెండి లేదు. అలా లేనటువంటి వెండిని చూసినట్లే, బ్రహ్మమునందు లేని జగత్తును చూస్తున్నాము అంటే జగత్తు లేనిదే అవుతుంది. లేని జగత్తును మనం ఎలా చూడగలుగుతాము? కాబట్టి బ్రహ్మమే అజ్ఞానం వల్ల జగద్రూపంగా నామరూపాలతో కనిపిస్తున్నది. బంగారు కంకణాన్ని చూస్తున్నామంటే కంకణంతోపాటు అందులోని బంగారాన్ని కూడా చూస్తున్నాము. ఇక్కడ కంకణము అంటే బంగారమే గుండ్రంగా వలయాకారంలో చేయబడింది. ఆ ఆభరణము పేరు కంకణము. ఇక్కడ నామరూపాలు రెండూ మిధ్య. అందులో ఉన్న బంగారమే సత్యము. అదే విధంగా **బ్రహ్మము ఒక్కటే సత్యము, నిత్యము, శాశ్వతమైనది. నామరూపాత్మకమైన జగత్తంతా మిధ్య.** అందుకే

# **బ్రహ్మసత్యం - జగన్మిథ్యా**

శ్రీ క్రోవి పురుషోత్తమశర్మ, శ్రీమతి లక్ష్మీనరసమ్మ గార్ల పౌత్రుడు, శ్రీ క్రోవి కృష్ణమూర్తి, శ్రీమతి సత్యపర్వతవర్ధనమ్మ గార్ల జ్యేష్ఠపుత్రుడు హరితస గోత్రీకుడు, **పరమానందనాథ** దీక్షానామధేయుడు అయిన **డా॥ క్రోవి పార్థసారథి** సర్వజనామోదముగా సులభశైలిలో వ్రాసిన **బ్రహ్మసత్యం–జగన్మిథ్యా** అనే ఆధ్యాత్మిక గ్రంథము సమాప్తము

సర్వేజనాః సుఖినోభవన్తు

సమస్త సన్మంగళానిభవన్తు

ఓం తత్సత్